

సత్యాసత్యములను గ్రహించుచున్న సోదర సోదరీమణులారా!

ఇక్కాలమందు జరుగుచున్న కుల, మత మారణహోమమునకు, దుర్వ్యసనములకు లోనయి సమిధలయినటువంటి నా సోదరీ, సోదరుల హృదయములను గ్రహించి యీ గ్రంథమును లిఖించితిని. మూఢావస్థలో మ్రగ్గుట యింకెంత కాలము. ఎప్పటి పీడనో కాని యిప్పటి వరకు మనలను నీడలాగ మూఢ విశ్వాసాలు వెంటాడుచున్నాయి. ఆలనాటి బూజు పట్టిన మూఢ సిద్ధాంతాలను పట్టుకొని ఇప్పటికీ ప్రాకులాడుచుండుట యెంతయవివేకము. వాస్తవం పరిశోధించిన అప్పటి తాత్వికులు కొందరు నిత్యానిత్య వస్థువివేకం ద్వారా గ్రహించిన సారమును, వారి సాధన ఫలితములు బోధించినారు. వాటిని గ్రహించలేకపోవుట దురదృష్టకరము. ఈ వృత్తమును చదువరులు తనలోనున్న స్వాభిమానమును, కుచ్చిత, కుతంత్ర గుణములను విడిచి ఈ గ్రంథరాజమును పఠించినచో నిగ్రహము గల ధీమంతులకు సత్యములేయని గోచరించును. మూఢ మతులకు యివి వాస్తవములని తెలిసిన వీటిని వొప్పుకొనక సంఘ విచ్ఛిన్నమునకు పాటు పడుచున్నారు. వీరనుకొనె అతిజ్ఞానమనే యజ్ఞానము ద్వార ప్రజలలో ప్రేమాభిమానాలు పెరుపై వొకరంటె నొకరు అయిష్టపడి మానవున్ని మానవుడు చూసి భయపడి మారణాయుధములు యిప్పటికే తెచ్చుకున్నాడు. ఈ అణ్వాయుధ కాలమున కూడ మతము మత్తును నెత్తికెక్కించే మతోన్మత్తులు వారి ఉపన్యాసముల ద్వార, ఆ మతాచార్యులు యిప్పటి యువకులను ఉద్రేకపరచి మనము మనమే కొట్టుకొని మరణించేలాగున చేయుచున్నారు. కావున యిలాంటి మూఢాభిమానములను విడచి ప్రపంచ

సౌభ్రాతృత్వము కోరు హృదయమున్న మనుష్యుడు తన తోటిమానవు లందరు ఒకటేయన్న సూత్రమును స్వీకరించిననాడు, మనము చూసే ఈ సుందర ప్రపంచము అంతా ప్రశాంతముగా నుండును. మన పూర్వీకులచే మార్పు చెంది అందముగా అలంకరించుకున్న ఈ ప్రపంచము మనకూ మన పిల్లలకు హాయినొసంగుచున్నది. ఇలాంటి సూత్రమును దృష్టిలో వుంచు కొని మానవుడు నడుచుకొన్ననాడు ఈ సుందర ప్రపంచము అణ్వాయుధ ములద్వార భస్మము కాకుండును. ఆలోచనపరులకు మతము కంటె మానవత గొప్పది. ప్రేమాభిమానములు కరువైననాడు మన మానవ జాతియంత క్రోధమనే మహాదావాగ్నికి గురియై బూడిదగా మారిపోవును. కాబట్టి మానవాభ్యుదయమును కోరువారెల్లరును సదా ఈ పలుకులను ఆలకించి తనలో నున్న మూర్ఖపు గుణములను విడువవలెను. లేనిచో మనకు కనిపించే యీ ప్రకృతి మాడి మసిగా మారిపోవును. ఇప్పటికైన ప్రపంచ మానవులు మేల్కొనండి, జాగ్రత్తపడండి, తనలోనున్న మూర్ఖపు సంశయములను, మూర్ఖపు ఆలోచనలను విడువండి. మానవుల ఐక్యత కొరకు మాత్రమే ఈ గ్రంథము లిఖింపబడెను. గాని, మానవులను తిరస్కరింప నా ఆశయంకాదు. గావున జ్ఞానులు గ్రహించగలరు.

ఈ సమాజంలోని కుళ్ళు వ్యవస్థను సమూలముగా నాశనము చేయ వలెనని నా ధ్యేయము. ఈ కుళ్ళు యెక్కడో లేదు మన ఆలోచనలోనే ఉంది. కావున చెడు ఆలోచనలను విసర్జించండి. దీనికి మీరందరు సహకరించిన నాడు నా కృషి వ్యర్థము కాదని నా సోదర సోదరీమణులకు మనవి చేయుచున్నాను.

ఇట్లు

చరాచర సుఖాభిలాషియగు మీ సోదరుడు

**అవధూత నిర్మలానంద స్వామి.**

# కవి పరిచయము

శ్రీ స్వామీజీ చిన్న వయస్సుననే (7వ ఏటనే) గురువు గారి వద్ద ధ్యానోపదేశము తీసుకొనెను. అప్పటి నుండి యోగాభ్యాసము చేసి నిశ్చలమైన ధ్యానముద్రలో నిమగ్నమైయుండిరి శ్రీ స్వామీజీ పలుచోట్ల తిరిగి ఎందరో మంది మహానుభావులను, దర్శించి, ఎందరో మేధావులతో చర్చించి, ప్రజల్లో సామాన్య పౌరుల్లాగ తిరుగుచు వారి హృదయ గ్రంథిలో ఉత్పన్నమగు మంచీచెడు యాలోచనలను గ్రహించి వారిని సత్ప్రవర్తనతో ఉండగలరని యిప్పటి వరకు పలుచోట్ల ఉపన్యాసములు చేసినారు. వీరు "విశ్వమానవత సమాజము" అనే సంస్థను స్థాపితం చేసినారు. ముఖ్యముగా మన భారతదేశమున కుల, మతములను అధిగమించి, సంకుచిత భావములను కూల ద్రోసి ప్రేమాభిమానములతో మెలగవలెనని వీరి అభిప్రాయము. ఈ సుగుణాల గనిని గురించి వ్రాయడం గాని, చెప్పడం గాని చేతగాదు. వీరిని దర్శించి, చర్చించిన మహానుభావులెందరో వారి మనస్సును అదుపులో పెట్టుకొని వెళ్లిరని తెల్పవలెను. శ్రీ స్వామీజీ బయట స్వామీజీలాగ (యోగీశ్వరునిలాగ) కనిపించకున్నను; యింటిలో ఉండి మనము అనుసరించినప్పుడు వారి నడక మనకు గోచరించును. అలాంటి మహానుభావుని హిత వచనంబులు విని తరించగలరని ఆశిస్తున్నాము. శ్రీ స్వామీజీ భారత దేశములోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమున, తాలూకా, జిల్లా, మండలము నిజామాబాద్‌లోని ముదక్‌పల్లి గ్రామంబున శ్రీ గంగాగౌడ్ మరియు పోచమ్మగారల ఏకైక పుత్రరత్నము. ఇదే గ్రామమునకు చెందిన మట్టి మాణిక్యము మరియు శకుంతలమ్మగారల పుత్రికయైన మన మాతృమూర్తిగారలకు వివాహము జరిగినది. మాతగారు

13వ ఏటనే దీక్ష తీసుకొనెను. శ్రీ స్వామీజీ చిన్ననాటి నామము ఎ. నారాయణగౌడ్, మాతృమూర్తి చిన్ననాటి నామము ఆం. భాగ్యము. వీరికి వారి గురువుగారు "అవధూత నిర్మలానంద స్వామి" గా దీక్షానామము నొసంగెను. మరియు మాతృమూర్తిగారికి "జగత్పరం జ్యోతి" గా శ్రీ స్వామీజీ దీక్షానామము నొసంగెను. వీరి దగ్గర యెందరో బ్రహ్మచర్య దీక్షను తీసుకున్నారు. వారిలో ముఖ్యులు బ్రహ్మచారి నరహరిగారు. చిరు ప్రాయము నుండి స్వామీజీ ఎన్ని చేదు అనుభవాలను గాంచిరో ఈ పుస్తకము ద్వార మనకు విదితమగును. కావున సమాజములో ప్రతి మానవుడు నిర్మల హృదయముతో జీవించాలని బోధించిన ఈ బాలయోగి వచనములు నిత్య సత్యములు.

ఇట్లు

**విశ్వమానవత సమాజము.**

సోఽహం

గురుచరణం

# హృదయ ఘోష

ఆది మానవుడు ఉత్పత్తి అయిన నుంచి మార్పును కాంక్షిస్తూ వస్తున్నాడు. అటు ప్రకృతి పరంగాను, ఇటు అంతర్ముఖంగాను. అయితే ప్రకృతి పరంగా ఎంతయో ప్రగతి సాధించినాడని చెప్పవచ్చును. ఇంకను సాధించగలడు. ఆకాశంలో ఎగిరేవరకు మనిషి ప్రకృతి పరంగా పురోగమించాడు కాని అంతర్ముఖంగా మాత్రం తిరోగమించినాడు. అంతర్ముఖంగా తన మనస్సును ఆధీనంలో ఉంచుకునె తెలివి ఉండికూడ వ్యసనలోలుడై యింతింతకు దిగజారి పోవుచున్నాడు. ఆ మనోచంచల ప్రభావం వలన ఎన్నియో దురలవాట్లను అలవరచుకొని మానవులె మానవుల ఐక్యతను విచ్ఛిన్నము చేయుచున్నారు. అది ఏలయనగా....

మానవుడు ధనాపేక్షచే పశువు బోలె తిరుగాడు చుండును. ప్రప్రథమమున వస్తువు మార్పిడి ఒరుపు చుండెడిది. అనగా ఒక వ్యక్తికి పెసల్లు నొసంగినచో ఇంకొక వ్యక్తి కందుల నొసంగెడివాడు. కొన్ని జొన్నలు నిచ్చిన కొన్ని నిత్యావసర వస్తువులను ఇచ్చేవారు. వస్తువు మార్పిడి నిమిత్తము యిబ్బందులను తొలగించుకొనుటకు మొదట గవ్వలను, తదుపరి రాగి, వెండి, బంగారు నాణెములను వినియోగించుకున్నారు అందుకే యిప్పుడు కూడ సామెతకలదు. "గవ్వకు కూడ కొరగావురా" (ఇంకొకసామెత:—దమ్మిడికి కూడ కొరగావురా!) అని. కొన్ని గవ్వలకు ఒక నాస్రి, కొన్ని నాస్రిలకు ఒక పైస, కొన్ని పైసలకు ఒక రూపాయిగా వాడుకలో వచ్చినవి. ఇప్పుడు కాగితము నోట్లు వచ్చెను. తాను వస్తువు

మార్పిడి నిమిత్తం ఏర్పరచుకొన్న డబ్బు తన చుట్టూ యిప్పుడు మానవులను త్రిప్పుకొనుచున్నది. ధనమున్న అన్ని సుఖంబులు బడయ వచ్చునని మానవుని హృదయాంతరాళములో ఒక గట్టి నమ్మకము ఏర్పడినది. అందుకే "ధన మూలం మిదం జగత్" అని సృష్టించు కున్నాడు.

ఈ జగత్తంత ధనముపై ఆధారపడి ఉన్నదనడం ఎంత అవివేకమో మీరే ఆలోచించండి. ధన రూపంలో గల అతి విలువైన వస్తువులన్ని ఇంటిలో ఉంచుకొన్న ఎడల వానికి కంటి కులుకు కరువై పోవును. మరి ధనమున్న వానికి సుఖముందంటారా? ఇక మధ్య రకము కుటుంబికుని సంగతి. ధనము కొరకు కడు ఆయాస పడుచుండును. ఏదో గగనములో విహరించవలెనని ఆలోచించు చుండును. తీరా చూస్తే రవ్వంత కూడ సుఖము లేదు. కూలి నాలి చేసుకొని జీవించు వారికి పై ధనవంతుల లాగ మేము కూడ ధనవంతులు కావాలని ఆపేక్షతో కృషిచేయు చుందురు. వీరికి కూడ సుఖమున్నదా? భిక్షమెత్తుకొని తిరుగు వారికి సుఖమున్నదా? పై మధ్య రకంవారికి, భిక్షమెత్తుకొను వారికి, కూలి నాలి చేసుకునె వారికి అకస్మాత్తుగా ధనము వచ్చిన యెడల వారి జీవితం ధనమయమై, జీవితం దుర్భరమైపోవును. అప్పుడు వానికి సుఖము లేదు. కేవలం ధనంవల్ల సుఖమున్న దనుకొనడము ఎంత అవివేకం. ఈ ధనము వల్లనే పూర్వపు చరిత్రలు మనము పరిశోధించిన ఎన్నియో హత్యలు, ఎన్నియో కుతంత్రములు జరిగినవని తెలియు చున్నవి. ఈ ధనము మానవుడిలో గర్వముగా మారి ఒక కుచ్చితపు బలమును చేకూర్చును. వాడు అనుకునె బలము వాస్తవముగా వాడి బలహీనతకు మూలమై రాను రాను ఊహాలోకంలో విహరించుచు నా అంతటి బలము గలవాడు ఈ లోకంలో లేడని ఆ మానసిక నీచ ప్రవృత్తిచే రాజ్యా కాంక్షకుడు అయి, అన్నదమ్ములను,

తల్లిదండ్రులను జంప వెనుకాడడు. ధనము, పదవి మానవుని ప్రగతిని నిరోధించుచున్నది. వాస్తవమయినటువంటి ప్రగతిని కాంక్షించే మానవులు కీర్తి కాంక్షను విడనాడి యితరులకు సేవజేయ బూనుదురు.

మానవులు ప్రశాంతత కొరకు రహస్యములను తెలిసుకొనుట కొరకు గుడులను నిర్మించు కొన్నారు. ఇప్పుడు కనబడు గుడులలో రవ్వంత ప్రశాంతత కనిపించదు. నిగూఢమైన విద్య కరువై పోయినది. ఇతర దేశముల కళల పెన్నిది మాదిరిగా మన భారతీయ సంపదలో శిల్ప సంపద అతి ముఖ్యమైనది. కొన్ని వేల సంవత్సరాలనాటి చిన్న శిల్పమయిన కొన్ని లక్షల విలువ చేయును. అందుకే యితర దేశపు చోరులు మన శిల్పములను మ్రుచ్చలించు చుందురు. గుడిలో దేవుడు కనిపించక పోయినను విలువయిన శిల్పసంపదను మనము కాపాడు కొనుట ఎంతయిన అవసరము ఇప్పటి దేవాలయాలు రాక్షసాలయాలుగా మారి దోపిడి నిలయాలుగా మారిపోయినవి. మన పూర్వీకుల దైనందిన జీవితము కొట్టవచ్చెటట్లు చిత్రీకరించిన చిత్రకళలు శిల్పములు పూర్వీకపు మన భారతీయుల యొక్క నడవకకు ఒక తార్కాణము. అప్పటి భారతీయ చిత్రకళ, శిల్పములు, చెక్కడములు యిప్పటి శిల్పులకు కష్టము. ఒకవేళ ఉన్నా, వారికి ఆహారమే కరువైనది. ఇప్పటి చిత్రములు, యిప్పుడు తయారు చేసే శిల్పములు మన భావి భారత పౌరులకు మన దైనందిన జీవితము ఎలా ఉన్నదో తెలుసు కొనడానికి దోహదపడును. వాస్తవముగా ఈ విగ్రహములను దేవుడు అని మనయొక్క ప్రజలు అంధ విశ్వాసముతో పూజించుట మనము చూసియే ఉందుము. అది ఒకింతకు మంచిదే. ఎందుకనగా ఎందరో ప్రజలు ఆ శిల్పమును దర్శించడంద్వార యితర దేశీయులైన చోరులు దొంగిలించకుందురు. కాని ఈ విగ్రహారాధన ద్వార ప్రజలలో భిన్న భిన్న అభిప్రాయాలు యేర్పడి

భిన్న మనస్కులై నాదేవుడు గొప్పయని, నీ దేవుడు గొప్ప యని శిల్పి చేసినటువంటి చిత్ర విచిత్రములయిన శిల్పములగని భ్రమలకు లోనయి, ప్రకృతి ప్రసాదించిన శిల్పమయిన ఈ దేహమును పరిశోధించక ఆ చిత్రమైన శిల్పముపై తన విచిత్రమైనమనస్సును మరల్చుచున్నాడు. తద్వార బ్రాంతి పోక తీర్థయాత్రలు చేయుచుందురు. తీర్థమనగా నీరు, యాత్రయనగా ప్రయాణము. అనగా నీరు కొరకు ప్రయాణం. మన భారత దేశమున నీరుకు కరువు లేదుకదా. మరిఎందుకో ఈప్రయాణము మానవుడు ఆలోచించుకొనడు. ఔను దేవుని పేర తిరిగాడు కదా, ఈ యాత్రల ద్వార సత్సంగత్యము మరియు దుత్సంగత్యములు ఆ మనుష్యునికి ఎదురవుట సహజము. తద్వార లోక జ్ఞానము సంతరించుకొనును. వివిధ రాష్ట్రాల, వివిధ దేశాల ప్రజలభాషలు వేరు. వారి సంస్కృతి వేరు. అనగా కొందరు ఫాంట్లు వేసుకొందురు కొందరు దోతి కట్టుకొందురు, ఆ దోతిని కొందరు చెంగులాగ, కొందరు ఫాంటులాగ, కొందరు లుంగిలాగ కట్టుకొందురు. కొందరు స్త్రీలు చీర కొంగును వెనకకును, కొందరు ముందరకును వేసుకొందురు. ఆహార విషయంలో కొందరు అన్నమును, రొట్టెను, ఫలములను, క్షీరములను తీసుకొనుట మనుష్యుడు అనుభవపూర్వకముగా గాంచును. యాత్రల ద్వార లోకానుభూతి పొందడమనేది అతిశయోక్తికాదు. అలా తిరగడం ద్వార దేశ, విదేశాల సంస్కృతి వారి భిన్నభిన్న అభిప్రాయములను, అలవాట్లను తెలకించగలరు అలాగే వృక్షముల యొక్క గాలి, అక్కడి వాతావరణం ఈ శరీరమునకు తగుల్కొనగానె శరీరం మార్పునకు గురి అగును. ఒక ప్రాంతము నుంచి మరొక ప్రాంతమునకు పోయి నీరు త్రాగిన జలుబు చేయుట సహజము. ఆ ప్రాంత ఖనిజ లవణములు, యీ ప్రాంత ఖనిజ లవణములకు తేడాగలదు, తద్వార శరీరం కృశించి పోవచ్చు, లేక మెరుగు వచ్చును. మనము తీసుకునే ఆహారంలో మన ప్రాంతములో లభించే ఫలములు అక్కడ లభించక పోవచ్చును అక్కడి ప్రాంతములో లభించే

ఫలములు యిక్కడ లభించక పోవచ్చును. మంచి పుష్టికరమైన ఆహారం లభించడం ద్వార శరీర ధారుఢ్యము పెంపొందును. అందుకే మన పూర్వీకులు తీర్థయాత్రలు జేసిరి.

ప్రాపంచిక చదువును అధికముగా నేర్చిన వారు కూడ ఈ విగ్రహముల చుట్టు తిరుగాడుచుండుట మనము చూసియే ఉందుము. కొందరు. డాక్టర్లు, లాయర్లు, యింజనీర్లు తుదకు విద్యార్థులు సహితము వీటి చుట్టు తిరుగుట మనము గమనించదగ్గ విషయం. వారిలో ఉండు జ్ఞానమును వృద్ధిపరచుకొనక ఎక్కడో చైతన్యమున్నదని భ్రమించువారు చదువరులేనా? అని అనుమానం కలుగుచుండును. తనలో వున్న చైతన్యమును ఎరుంగక, చైతన్యం ఎక్కడో కలదని తిరుగాడుచుందురు. ప్రపంచమును ఆడించె ఒక అయస్కాంతము లాంటి కర్మ శక్తి, తనువును ఆడించే ఈ చైతన్య శక్తిని గ్రహించక ఎక్కడో భగవంతుడు గలడని భ్రమ జెందుతారు.

జ్ఞానహీనమైన కప్పలకు, గార్ధబములకు జ్ఞానమున్నచో అవి మన లాగే వొక గార్ధబ చిత్రమునకు వంద శిరములు, వంద హస్తములు పెట్టు కొని జంతువులు పూజ చేసేడివేమో. ఈ చిత్రమైన మానవ జంతువు మనుష్యరూపంలో ఉన్న విగ్రహములకు, కొన్ని జంతు రూపంలో ఉన్న విగ్రహాలకు పూజజేయు చుందురు. ఈ పూజ నేను మార్పు జెందుచు వచ్చిన రూపమని మరువ కుండుటకు కాబోలు. ఈ పూజ ద్వార గ్రహించ వలసిన విషయం ఒక మనిషి నుండి మరొక మనిషి జ్ఞానం తెలుసుకొనడం కాబోలు.

గ్రామములో శిగములని, శివసత్తులని వారు వాగడము ద్వార ఆ గ్రామ ప్రజలు ఆ శివసత్తుల వద్దకు వెళ్లుచుందురు. శిగము

వచ్చినవారు ఊగడం, ఏదోచెప్పడం ఆ గ్రామ ప్రజలు అనుసరించడము జరుగుతుంది. గ్రామ దేవతల పేరున ఊరడమ్మ, పోచమ్మ, మైసమ్మ మొదలగు విగ్రహాలముందర ఎనుబోతులను, మేకలను బలియివ్వడం జరుగుతుంది. ఊరి పెద్దమనుష్యులు వారి పెద్దరికమును నిలబెట్టుకోవడానికి ప్రజలకు వొకవిధమగు భీతిన కలుగజేసి యిలాంటి కార్యక్రమములు జరిపించు చుందురు. ఇలా చేయడం ద్వార పశువులకు గాలిరోగాలు పోవునని, పశువులు ఆరోగ్యంగా నుండునని, ప్రజలందరు సుఖశాంతులతో ఉందురని వీరి మూఢనమ్మకములు. ఈ శివ సత్తుల మాటలంటె అక్కడి ప్రజలకు ఎనలేని భక్తి విశ్వాసం గురి. వారి విశ్వాసములను ద్రవ్యరూపంగా సొమ్ముజేసుకొని కాలం గడుపు చుందురు. ఇది పల్లెటూర్లలోనే కాకుండా పట్టణాలలో కూడ చదువరుల మధ్యకూడ జరుగుచుండును. ఈ శివసత్తులు కొందరు 'నేను పోచమ్మనని, నేను నరసింహ స్వామినని వొర్లుచుండుట గాంచి అక్కడి అమాయకపు ప్రజానీకం "అమ్మా తల్లి ఏమి కావలెనో సెలవివ్వండి" అని ప్రశ్నించుచుందురు. దానికి సమాధానంగా ఆ మూర్ఖమతియగు శివసత్తి వీరి మూర్ఖపు బలహీనతను ఆసరగా చేసుకొని ఇంకా మూఢత్వం లోనికి దించుచున్నారు.

ఇలాంటి వారిని ఆశ్రయించుకొని కొందరు సోమరులు వారి పొట్టను నింపుకొనుచున్నారు. ఇది యొక సామాజిక నేరమైన వృత్తిగా పరిగణించి ప్రజలు ఈ అంధ విశ్వాసం నుంచి మేల్కొని వారికి తగిన బుద్ధి చెప్పవలెను. లేకున్నచో వీరి వల్ల ప్రజల్లో ఐక్యత నశించును.

ఇక దర్గల వద్దకూడ ఇలాంటి శిగములు ఊగుచుందురు. వాడికకు కూడ ఏందరో మంది ప్రజానీకం పోయి వారి కోరికలను ఆ మూర్ఖపు ఆలోచన పరుడు లేదా మానసిక చంచైల్యము గల వ్యక్తి లేదా (హిస్టీరియా) మానసిక రోగముగల వ్యక్తిని ఆశ్రయించి వారి

మాటలను వినుచుందురు. ప్రకృతి సహకరించినచో తన పనులు సౌలభ్యంగా జరిగిపోవును. ప్రకృతి సహకరించనిచో ఆ పనులు కానేరవు. పనులు అయినచో వారు దేవుడే ఈ సహాయము చేసెనని ఆ దర్గలకు వెళ్ళి దట్టీలు కప్పడం, వెండినగలు కానుకలుగా యివ్వడం, ఊదు కాల్చడం బెల్లము పంచిపెట్టడం, కందూరు చేయడం మనకు కనిపించుచున్న నిత్య దృశ్యములే. అమాయకపు కోటాను కోట్ల మూగజీవులను ఈ దర్గల వద్ద మరియు గుడులవద్ద బలిచేయుచున్నారు. ఎంత అంధవిశ్వాసం! వీరికి హృదయ వికాసం కలిగేదెన్నడో!

గ్రామాలలో పీర్లు దేవుళ్లు అని వాటిని ఎత్తుకొని యింటింట తిరుగుచుందురు. ఆ పీర్లను ఎత్తుకున్న మూర్ఖపువాని మాటలు దేవుని వచనములని అమలు చేయకున్నచో మనము అందరం భస్మమవుదుమని యింకా భయపడే అమాయకపు ప్రాణులు ఎందరో గలరు. వీరు మేల్కొనక పోతే వారి ఆటలు యిలా సాగుచునే ఉండును. సాగినంత కాలం మన ప్రజలందరు మూఢ విశ్వాసాలతో ప్రేమాభిమానాలు నశించి ఆ దేవుళ్ళ పేర కొట్టుకొని, చంపుకొనుట మనము గాంచి యుందుము. ఈ సంఘటనల ద్వారా కూడ మానవుల ఐక్యత నశించి పోవుచున్నది. ఈ పీర్లు, దర్గాలు చనిపోయిన వారి ప్రేతముల యొక్క గుర్తులు. ఆ పూర్వీకులైన వారి పేర్లను స్మరించుకొనుట, వారు జేసిన ఘనకార్యము లను వర్ణించుకొనుట మంచిదే కాని వారి పేర ఈ మూఢ విశ్వాసములు ఉండుట మంచిది కాదేమో. ఒకవేళ వారు జీవించి ఉన్నచో వారు కూడ మనతో నవ్వుకొని ఉండేవారు. మన సంతతి వారు ఎంత మూఢ విశ్వాసంతో ఉన్నారని సిగ్గు పడేవారేమో. యింకను కొందరు యేసు నామము పేర "మీకు మేలు కలుగుగాక", మీ కొరకు మేము ఏసును ప్రార్థింతు మని ప్రజలను మభ్యపెట్టి ప్రార్థనలు సలుపుచుండురు కొందరు గ్రామీణ

ప్రజలు అక్కడికి వెళ్ళి హిస్టీరియాతో క్రిందబడడం, పొర్లడం, దాని ద్వార ఆ మతిమరుపులో వారు నేను దుర్గమ్మననో, కాళికాదేవిననో ఏదో ఒక హిందూ దేవుడి పేరు చెప్పడంవల్ల మీ హిందూ దేవుల్లందరు రాక్షసులు అని, మా క్రైస్తవ దేవుడే అసలయిన దేవుడని వారికి మూఢ విశ్వాసములను నూరిపోయుచు వారి మతములో చేర్చుకొందురు. ఇలా కూడ మన ప్రజలలో ఐక్యత పాడైపోవుచున్నది. ఒక మతం యొక్క జనులు యింకొక మతం యొక్క జనులను లాగటానికి వారి బూజు దేవుళ్ళ అభిప్రాయాలను యింకొకరిపై రుద్దటానికి ప్రయత్నించుచుందురు. ఆ ప్రయత్నంలో అమాయకులైన జీవులు ఇటు ఏ మతంను నమ్మాలని, అటు ఏ దేవున్ని నమ్మాలని తలలు బద్దలు కొట్టుకొన్న సంఘటనలు ఎన్నియోగలవు. పీరులపండుగ సమయమందు ఎందరో తన శరీరంను రుధీరమయము చేసుకొందురు. దీనిని రాజకీయవేత్తలు, చదువరులు సహితము దేవుడని వారిని ప్రోత్సహించుట ఎంత మూర్ఖత్వము. పూర్వీకులు రణరంగమునలో లేదా మంచి కార్యములలో మరణించిన వారిని స్మరించుట మంచిదే, కాని అప్పటి విశాదకర దృశ్యమును యిప్పుడు వొల్లంత రక్తమయం చేసుకొని తిరుగాడుట ఎంత మూర్ఖత్వమో మీరే ఆలోచించుడు. విజ్ఞానం పెరిగిన కొలది మానవుడి మేదస్సు మాత్రం అధోఃపాతాళమునకు పోవుచున్నది.

ఈ మతములకు అన్నింటికి మూలమైన దేవుడు ప్రపంచంలో ఒక్కడే. ఈ మతవాదులు ఎవరైన పరిశోధనతో ఆ దేవున్ని చూచినారా? మేము ముస్లీములము రోజు 5 సార్లు నమాజు సలుపుతాము. మాది ఇస్లాం మతం అనేవారు దేవుడిని చూడగలిగారా? మేం క్రీస్తులం అనేవారు ప్రతి రోజు ప్రభూ, ప్రభూ యని చర్చిలో ఎన్నో వింత ప్రార్థనలు చేస్తూ ఉంటారు. ఆ ప్రార్థనల వల్ల ప్రభువు కనిపించెనా ? మేము

హిందువులము ప్రతిరోజు గుడికి వెల్తాము. మాది హిందూమతం అంటారు. వారు భగవంతుడిని ఆ గుడులలో చూశారా? అసలు దేవుడు వీరి కంటికి కనిపించెనా? వీరు చూసినారా? చూసినమనుట ఎంత అవివేకం. వారి భావనలను బట్టి దేవుడనేవాడు మనలాంటి శరీర ధారుడే యని ఒప్పుకొనక తప్పదు. ఒకవేళ వారి మనోభావాలైన అది ఊహనే. ఊహ నిజం కాదు గదా అది అంతా అబద్ధం. ప్రత్యక్ష అనుభూతి అన్నచో యది ప్రకృతి మనకు ఏదో రూపంగా జ్ఞానేంద్రియములకు గోచరించును. ఎప్పుడైతే గోచరించెనో అది ప్రకృతిలో ఏదో ఒక మూల పదార్థంయని మనం అనదగును. ఊహ అయినచో అది ప్రత్యక్షమైన సాక్షికాదు. కాబట్టి అది అబద్ధం కావచ్చును. ఊహ నిలకడలేనిది. కావున ఊహ ఊహనేకాని వాస్తవం కాదు. మతవాదుల పిచ్చి మాటలవల్ల వారి మానసిక రోగంను ఆరోగ్యవంతులకు రుద్ది, ఆరోగ్యవంతునికి ఇలాంటి మానసిక రోగంను కలుగజేయుచున్నారు. వీరి వెఱ్ఱి మొఱ్ఱి ఊహలవల్ల ప్రపంచ ప్రజలలో ఐక్యత లోపించడానికి నాంది పలుకుతుంది. ప్రజలు వాస్తవాన్ని గ్రహించేదెన్నడో!

వాస్తవముగా దేవుడనేవాడు మన మానసిక ప్రవృత్తులకు అతీతుడు. పరమాణువు కంటె కూడ భిన్నుడు. ఆ దేవుడనే మాటకు పేరు పెట్టుకొనడం కూడ అవివేకమే. దేవుడనే మాట స్త్రీకాదు, పురుషుడుకాదు, నపుంసకత్వముకాదు. ఒక వస్తువుకాదు. నోటితో ఉచ్చరింప వీలుపడదు. కండ్లతో గాంచలేము. మనస్సుకు అతీతంగా పోయినచో ఆ ప్రశాంతతను పొందిన మహావ్యక్తులకు అది అనుభవమే. ఆ అనుభవమును ప్రకృతి ప్రసాదించిన అంతరేంద్రియములతో గాని, యీ శరీరంతోగాని చేరుకొనలేని నిర్వికారస్థితిని గాంచి దేవుడు ఉన్నాడని ఆస్తికులు, అర్థంచేసుకొని ఏంలేదని పరిశోధించిన నాస్తికులు దేవుడు లేడనే అంటారు. కాని 'అది

ఆస్తికత్వంకాదు, నాస్తికత్వంకాదు. ఈ రెంటింటికి అతీతమైనది. అది గ్రహించిన సత్యపరులు మానవోద్ధరణకు పాటుపడతారు. ఈ ప్రయత్నంలో విశ్వమానవులను ఏకం చేయాలని పూనుకున్న నేను ఒక చిన్న పరమాణువును.

తీవ్ర ప్రవృత్తిగల మానవులు నివృత్తి మార్గము అవసరమై ఆదిలో ఆలోచింపసాగినారు. మార్గమును వెదకనారంభించినారు. దానికి శరీరమే సాధనమని అప్పటి సాధకులు గ్రహించి తన ఉపాయము ద్వారా నివృత్తిని సాధించిరి. ఆ పరిశోధన ద్వార పంచమహాభూతములు భిన్న భిన్న ప్రకృతి సర్వము యేకత్వంబని యెరంగిరి. అలా సాధించడానికి ఎన్నియో సంవత్సరములు పట్టెను.

కొందరు తాత్వికులు మన శరీరము ఎలా మార్పు చెందుచుండునో ఈ మహా ప్రకృతి గూడ మార్పు జెందుచున్నదని నుడివినారు. కొందరు పుట్టి, పెరిగి, నశించు చున్నదని తెలిపినారు. ఇంకొందరు పుట్టుటయు పెరుగుటయు, మార్పుజెందుటయంతా మన దృష్టిలోపమే యని దెలిపినారు. అప్పటి పరిశోధకులు ప్రకృతి యంతయు అనగా భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము మన మనోఫలకముల జ్ఞానముచే యోచించిన అణువుల వరకు, పరపమాణువుల వరకు భాగించవచ్చని తెల్పినారు. వాస్తవముగా కూడ ఇదే సత్యమని వారి వారి బోధనల ద్వార ప్రజలకు వారి పరిశోధన ఫలితములను వ్రాసి పెట్టినారు. ఇదంత యెందుకు మనకు మరణము సంభవించిన యీ ప్రపంచ మంతయు శూన్యము అయిపోవును కదా! కొందరు ఈ మరణము కూడ లేదని పుట్టుక మరణములు గూడ తన దృష్టి బేధము అని బోధించినారు. వాస్తవముగ దృష్టిబేధము ప్రకృతి మనకు ప్రసాదించిన వరము. దృష్టిలోపల "ప్రత్యక్షము—అనుమానము" చేరి యుండుట మనము గమనించ దగ్గ విషయము. ప్రత్యక్షమైన

ప్రపంచము అంతటికి ఒక విధమగు ఒకశక్తి (One Power) ఒక పరిమితిలో ఆడించుచున్నదని అలాంటి శక్తియే మన దేహములో వుండి మనను చలింపజేయు చున్నదని తెల్పుచుందురు.

దేహము నిర్మాణమయ్యే తొలి దశలోనే చలనము వచ్చినది. దేహము ముందా? చలనము ముందా? యన్న ప్రశ్న వచ్చి జేరును. చలనము ముందు యన్నచో, దేహము లేనిది చలనమునకు విలువలేదు. దేహము ముందు అన్నచో, చలనము లేని శరీరము ఎట్లు ఏర్పడ ఆస్కారమున్నదని వాదిస్తారు. ఎలాగో దేహములో చలనమున్నది వాస్తవమే.

ఇవి యన్నియు కొంతవరకు ఆలోచించిన వాస్తవములేయని వొప్పు కొనక తప్పదు. మనము మన మనస్సును ఒక ధ్యేయముపై ధ్యానము చేసినచో అప్పుడు మనకు వొక విధమగు ఆనందము గలుగును. ఆ యానందములో తనవు మరచి యుండుట అనుభవపరులైన వారు యెరింగియే యుందురు. అందుకే ఈ ప్రకృతి మరియు శూన్యము అని నాస్తిక మతము, ఆస్తికులు నిర్వికారమని బోధించు చుందురు. కాని ఆ స్థితిని నిర్వికారమనుట, శూన్య మనుట పొరపాటుయని నా భావము. వాస్తవముగా ఆ స్థితిని గూర్చి రచించుట పొరపాటు. మాటలతో జెప్పనలవి కాదు. దాన్ని స్థితి యనుటయు కూడ పొరపాటు. అందుకే మౌనమే సదాశ్రేయస్కరము.

ఇంకను యిండ్లలో బాలమ్మ పేర, శుక్రవారం దేవుడనే పేర నీచమైన కార్యములకు పూనుకొని మృగములను ఘోరంగా బలి యిచ్చి రాక్షసులవలె భక్షించుచురు. ఇంకను కొన్ని పెద్దల పేరిట, పెద్దల తిథియని వారి పేరున అమాయక మృగాలను కోయుట ఎంత అవివేకము! కొందరు మాంస భక్షణ పరులు యివి మనము భక్షించడానికి గాక ఎందుకు పుట్టాయని, వాటిని కోసి తింటున్నాము కాబట్టి పాతకంలేదని, యిప్పటి డాక్టర్లు తినుమను చున్నారని, తింటె దేహధారుడ్యం పెంపొందగలదని పలుకుచుందురు కొందరు శాఖాహారులు మాంస భక్షణ చేయడం మహా

పాతకం అని, నీచమని, అవి మనలాంటి జీవరాసులే యని వాటిని జంపుట నేరమని జెప్పుదురు. వాటి శరీరం కూడ మనలాగే రక్త మాంసములతో నిర్మితమైనవి, వాటిని కోయుచున్నప్పుడు అవి దుఃఖించును. వాటికి కూడ పిల్లలపై మమకారము, దినచర్యలు గలవు. జ్ఞానమొకింత హెచ్చుగానున్న కారణాన మానవులు మచ్చిక జేసుకొని అమాయక ప్రాణులను భక్షించు చుందురు అని శాఖాహారులు వీరిని ఏలనాడు చుందురు. ఇక మాంస భక్షణ చేసేవారు చెట్లలో ప్రాణ ముందని, విత్తనాలలో కూడ ప్రాణ ముందని ఆకులను తెంపునపుడు అవి దుఃఖించవాయని, పప్పుదినుసులు ఉడికించిన అవి ఏడ్వవాయని వచించుచుందురు. మనము సేద్యము చేసే వరి, జొన్నలు మొదలగు పంటలకు క్రిమిసంహారక మందులు వాడడం లేదా యని, తద్వారా ఆ క్రిములు నశించడం లేదా, అది హింస కాదా, అలాగైతే మేము చేసేది హింస ఎలా అవుతుంది అని వక్కాణించు చుందురు. వీరి విపరీత అలవాట్లు శుశ్క వేదాంతం ద్వారకూడ దేశ ఐక్యత కొంత పాడవుచున్నదని తెలియదగును.

మాంస భక్షణ ద్వార రోజు కొన్ని కోట్ల టన్నుల ఆహారము మిగులుచున్నది వాస్తవమే. కాని సేద్యము చేయుచున్నప్పుడు (అనగా పొలం పనులు చేయునపుడు) ఎన్నియో క్రిములు నశించుట వాస్తవమే. సేద్యం చేయనట్లయితే మనము జీవించుట కష్టమై పోవును. అలా సేద్యంచేసి యితరులకు ఆహారము నొసంగుట ద్వార ప్రాపంచిక కర్మానుష్ఠానం సక్రమంగా జరుగు చున్నదని తెలియవలెను. ప్రకృతిలో అన్ని వస్తువులు అనగా ఆహారమునకు పనికి వచ్చే ఆకులు, కూరగాయలు, మరియు మాంసమును (ఫ్రిడ్జ్ పెట్టకుండ) కొన్ని రోజులు నిలువ ఉంచినచో వాసన పట్టును. కాని మాంసము యొక్క వాసన అదోవిధమైన దుర్వాసనగా ఉండును. విచార పరులు ఆలోచించిన యితర మూగజీవులను హింసించుట, దేవుని పేరకూడ కోయుట నేరమని బుద్ధిమంతులు ఎరుంగ

గలరు. పూర్వ కాలమందు మాంసమే ఆహారంగా తీసుకొని జీవించెవారు. నాగరికత పెరిగి జీవనాధారము కొరకు ధాన్యాలను పండించుకొని మానవుడు శాఖాహారాన్ని అలవరచు కొన్నాడు. అయినా జింహ్వారుచికి మరిగిన మానవుని ఖడ్గమునకు బలియైపోయిన కొన్ని మూగ జీవాలు అంతరించి పోయాయి. మన సంతతి వారికి ఫలానా జంతువులు, పక్షులు ఉండేడివని చిత్రకళల ద్వార రచనల ద్వారా చదవడమేకాని దృష్టితో భావిపౌరులు తిలకించలేరు. ఈ మానవతా దృష్టితోనైనా హింసించడం మానవలెను. ప్రభుత్వము వన్యప్రాణుల పట్ల జాలి తలంచి వేటాడడము నిషేదించినది. అయినా చోరగుణముగల మానవులు వాటి అందమైన చర్మముల కొరకు, ఈకల కొరకు, మాంసము కొరకు రహస్యముగావేటాడుచునే యున్నారు. కావున ఓ దయామయులైన సోదరులారా! మన వన్య మృగ సంపదను రక్షించు కొనుటకు కంకణము కట్టుకొనవలెను. లేనిచో ఆ మూగ ప్రాణులు అంతరించిపోవుట తథ్యము. ఈ మృగములు, పక్షులు, ప్రకృతికి అంద మునిచ్చే వృక్షములు వాటి పువ్వులు, కాయలు, ఆకులు చూడ మనో హరంబుగా నుండును. కాన మానవులందరూ కలిసికట్టుకొని ఈ ప్రకృతి రమ్యతను కాపాడుకొనవలసిన అవసరమెంతైనా యున్నది. లేనిచో ప్రకృతి యందము పాడైపోవును. ఇక కాలానుకులంగా యోచించి కర్మ చేయవలసిన అవసరము మానవుడికి ఎంతైనా కలదు. కాని యిప్పుడు తెలిసిన దయామయులైన మానవులు మానవత దృష్టిగల ధీమంతులు మాంసభక్షణ మానడం మంచిది. మాంసభక్షణ లేకుండయే మనకు ప్రకృతి ప్రసాదించిన చెట్లద్వార ఆహారం లభించుచున్నదని, యెరంగి మూగ జీవులను హింసించకుండ వుండడమే శ్రేష్ఠము. చెట్లలో జీవం ఉన్నదనుట సత్యమే కాని వాటికి స్పర్శజ్ఞానం లేదు. అవి దుఃఖించునటుల యింత వరకు మనకుగోచరించలేదు. ఒక వేళ అన్ని జీవులలాగ వృక్షాలు

కూడ సుఖ దుఃఖములను అనుభవించునని తెలిసిన నాడు మనమొకింత యోచన చేతాము.

ఈ మాంస భక్షణ ద్వారా మదోన్మత్తులై దానికితోడు మత్తును స్వీకరించడము ద్వారా పరస్త్రీ గమనమునకు చోటు చేసుకొనుచున్నది. వట్టివారికి మాత్రం స్త్రీలను తిలకించిన మనో చంచెల్యము ఏర్పడదా అని ప్రశ్నించ వచ్చును. చలనము ఉన్న వస్తువు ప్రతి ఒక్కటి కదులును. చలనము లేనివన్నీ కదులక ఉండును. యిది మనకు ప్రకృతి బోధించుచున్న పరమ సత్యం. కాబట్టి మనసును సాత్వి కాహారం భుజించుటద్వార ఏకాగ్రత సంతరించుకొని అదుపులో బెట్టుకొన సులభమవును.

మనలాగే జంతువులు కూడ ప్రకృతి కార్యములలో శుక్ల, శోణితము ద్వారా బీజోత్పత్తి న్యాయం జరిగి మనలాగే యోని నుంచి బయలు వెడలెను. మనలాగె అన్ని అవియు చేయును. సుఖ, దుఃఖములు వాటికి కలవని మనమూహించిన బాధపడునని దయార్ధ హృదయులైన మహాను భావులు ఎందరో యిప్పటికే వచించిరి. అలాంటి సద్వచనములను చెడచెవిన పెట్టి నిర్ధయులై అమానుషముగా వాటి యెడ కాఠిన్యముతో ప్రవర్తించుచున్నారు. ఇట్టి ఘోరమైన ఘాతుకమును హృదయమున్న వాడెవ్వడును ఒప్పుకొనజాలడు. కాన సత్యాసత్యములనెరంగి కృత నిశ్చయుడవై యిలాంటి ఘోర కార్యములకు మన మానవజాతి అంతయు తొడ్పడకుందురుగాక యని మానవ సోదరులకు నే విన్నవించుకొను చున్నాను. మరియు యింతకుముందు వచించిన గుడుల ముందు, దర్గాల ముందు ఇతర మతతాలయాల పేర ఆ మూగజీవులను బలి పెట్టకుడని కరుణాసముద్రులైన నా ప్రపంచ మానవ సోదరులందరికి విన్నవించుకొను

చున్నాను. ఇలాంటి విచారము ద్వార మంచి కార్యములవు తోడ్పడ్డనాడు మానవులమనిపించు కొందుము.

అన్ని గుడులలో పలుండీలు పెట్టుట మనము చూసియే యుందుము. తద్వార ఆ గుడికి ఆదాయము అధికమగుటచే మనుష్యులకు కావలసిన కళాకారులను, నృత్య, సంగీత పండితులను పోషించుచున్నవి. ఇవియేకాక ఎన్నో మంచి కార్యములు నిర్వహించు చున్నారు. ఆ గుడుల వద్ద అధిక జనాభ పెరిగినకొలది చోరుల భయం అధికమగును. అమాయకుల నగలను, డబ్బులను కొట్టివేయడం ద్వార ప్రజలు బహుక్లేశములకు గురి అవుచుందురు. పూర్వీకపు గుడులలో కొందరికి ఉపాది యిప్పటికే కల్పింపబడెను. ఇంకా నవీనముగా గుడులు కట్టుచున్నారు. ఇలా కట్టడం ద్వారా మన భారతీయ శిల్పకళాకారులను పోషించుకొనడమే కాక మన కళను జీర్ణింప జేయకుండ చేసుకుంటున్నాము. కొందరు ఎరుపు గుడ్డలు వేసుకొని దేవునిపేర గుడుల వద్ద పూజారులై డబ్బును లాగుచుండుట మనము యెరింగియే వుందుము. వీరిలో భక్తి పేర యింటింటా తిరుగాడుచు గృహస్తులను మోసపుచ్చిన వారు ఎందరో గలరు. అలాగే సూటు, బూటు వేసుకొన్న వారు చూపరులకు నవీన సంస్కారవంతులుగా కనిపించే జేబుదొంగలెందరో గలరు. కాన వేషముల కంటే పలుభాషలను మాట్లాడువారి కంటే హృదయ నిర్మలత్వం గల వ్యక్తియే మహోన్నతుడు. ఇక గుడివద్ద బిక్షమెత్తుకొను వారి సంగతి. వాల్లకు కాళ్ళు, చేతులు, కండ్లు యిత్యాదులు సరిగ్గా ఉన్నా, యిది వొక వృత్తియని సోమరులై బిక్షక వృత్తిని చేపట్టినారు. ఇలాంటి సోమరులకు దానము చేయు మనుష్యులు దేశములో సోమరితనమును పెంపొందించు దేశ ద్రోహులు. మనము దానము చేసిన డబ్బును చెడు వ్యసనములకు అనగా మత్తు పదార్థమునకు ఎందరో వినియోగించుకొంటున్నారు. తద్వార యెన్నియో అఘాయిత్యములను చేయుచున్నారు.

అంతగా మనము దానము చేయదల్చుకొన్నచో ప్రభుత్వానికి దానము చేయ వచ్చునుగదా, లేదా పైన చెప్పిన ప్రభుత్వనిలయాలకు అంద జేయవచ్చును. అలా అందజేసినచో దేశసేవ జేసిన వారమగుదుము. పని చేయనివానికి భోజనం చేసె అర్హత ఎక్కడిది? పిల్లలు, వృద్ధులు, రోగులు. అంగ వైకల్యము గల వారికి తగిన ఉపాధి కల్పించు ప్రభుత్వం ఉన్నా నాడు ప్రతిష్ఠమైన మన భారత సంస్కృతి పెంపొందును. కొందరు భిక్షకులు పగలు యింటింట తిరుగాడుచు రాత్రి సమయమున ప్రజల మాన, ప్రాణ, ధనములను తస్కరించుచున్నారు. మరియు అందమైన పిల్లలను ఎత్తుకొని పోయి వారిని భిక్షక వృత్తిలోకి. దించుచున్నారు. కాబట్టి వీరి యెడ కడు జాగ్రత్తతో యుండవలెను. సూటు, బూటు మరియు రంగు బట్టలు వేసుకొన్న వారిలోకూడ మంచివారు గలరు. కాని సన్యాసమనే ముసుగులో కొందరు వ్యసనలోలులయి చోరత్వానికి దిగి వారి కపట నాటకములను బయట పడనీయకుండ జూసెదరు. అయిన అప్పుడప్పుడు వారి యొక్క కపట నాటకములు బయటపడుచునే యుండును. దొంగతనమన్నది. మహా నేరము. ఇతరుల సొత్తును ఆశించ కుండుటయే మంచిదని ప్రతి వొక్కరు యెరుంగగలరు. గుడుల వద్ద సత్రాలకు సరైన తలుపులు ఉండవు. ఉన్నా మనము తాళము వేసుకొన్నచో తగిన రక్షణ లేక ఆ గది నుండి సామానులను ఎందరో దొంగిలించుచుందురు. దేవాలయ సత్రములో అధికారికి అమాయకులు ఎంతో కొంత డబ్బు ముట్ట జెప్పనిదే ఆ గది దొరకదు. ఎవరైన తెలిసినవారు యిదేమిటని అడిగితే గదులు లేవని చల్లగా కబుర్లు చేప్తారు.దూర ప్రాంతాలకు వెళ్ళిన యాత్రికుడు స్త్రీలతో, పిల్లలతో బయట పరుండలేక వారికి (సత్రం వారికి) ఎంతోకొంత ముట్టజెప్పి ఆ గదిలో ఉండవలసిన కర్మమేర్పడును. సత్రము అధికారులు అందరు యిలా ఉంటారని నా అభిప్రాయం కాదు. ఇందులో కూడ మంచివారు

గలరు. కార్యోన్ముఖులైన యువకులు నీచబుద్ధిగల సత్రపు అధికారుల బండారములను బయటపెట్టి వారికి తగిన బుద్ధివచ్చేటట్లు చేయుదురు.

అయితే ప్రజలలో కాశీలో చనిపోతె కైలాసం వెళ్తామని. శ్రీరంగంలో మరణిస్తే వైకుంఠం పోతామని కొందరి మూఢనమ్మకము. కొందరు మక్కాకు వెళ్లిన మోక్షముగలదని అంటారు. వీరి మూఢనమ్మకములతో సొమ్ము జేసుకునే రచనలు, ఉపన్యాసములు మనము తరచు వినియే వుందుము. వాస్తవముగా కాశీలో ఉన్నవారికి, శ్రీరంగంలో ఉన్నవారికి, మక్కాలో ఉన్నవారికి మోక్షము లభించినదా ? అలా అయితే ధనవంతులు కొన్ని వేల రూపాయలు ఖర్చుచేసి అక్కడికి వెళ్ళి మోక్షాన్ని పొందుదురు. మరి యోగాభ్యాసపరుల గతేమిటి ? తపస్సు చేసి మనస్సును ఏకాగ్రత పరచుకొన్న వారికి మోక్షంలేదా ? కాశీలో, శ్రీరంగంలో, మక్కాలో దుర్మార్గులు ఒక్కరైనను లేర్నా? అలా పాప జీవనం గడపని యా ఊరిలో వున్నచో మనము కూడ సంస్కారవంతుల మైదుము గదా, అలాయైన సంతోషపడడమే. పూర్వకాలంలో పండితులు, జ్ఞానులు, యోగభ్యాసపరులు, వేదాధ్యయన పరులు యిలాంటి స్థలాలలో (కాశి, శ్రీరంగం, మక్కా మొ॥) మహానుభావులు ఉండిరి కాబోలు. అందుకే అక్కడికి పోతె మోక్షమున్నదని పూర్వీకుల అభిప్రాయము. పూర్వపు సామెత వొకటి గలదు "కాశికి పోయిన వాడు కాటికి పోయిన వాడు ఒక్కటె" అని. అప్పటికాలమున నడచియే వెళ్లవలసి యుండేదిది. అందుకే తిరిగి రావడం శ్రమతో కూడుకున్న పని. ఇప్పటి మానవుల ప్రగతి తైల వాహనముల వరకు, యింకా సూర్యరశ్మి వాహనముల వరకు చేరుకున్నది. యిప్పుడు కాశికి పోవటం కఠినమేమికాదు. ఒక్క కాశి ఏమిటి ప్రపంచములో ఏ మారుమూల కైనను పోయి తిరిగి రావచ్చును. మానవుని యొక్క మేధస్సు సుఖాన్వేషణలో భావి ప్రపంచ పౌరులను, తాత్వికులు, శాస్త్ర

వేత్తలు వారి పని పరిశోధనా నిధిని, శరీరము త్యజించి (మరణించిన) నప్పటికి వారు మిగిల్చి పోయిన పరిశోధన తరగని నిధిని వాడుకొనుచున్నాము.

ప్రపంచంలో ఎన్నోమతాలు ఆవిర్భవించినవి. అలాగే భారత దేశంలో కూడా శివమతము వారు విష్ణుమతము వారిని, విష్ణుమతము వారు శివమతస్తులను, హిందువులు ముస్లింలను, ముస్లింలు హిందువులను, వీరు క్రైస్తవులను, మతము పేరిట అక్కడక్కడ ద్వేషించుకొనుట మనము చూసియే యుందుము. అలా కాకుండా ద్వైతము, అద్వైతము విశిష్టాద్వైతం అని ప్రతిపాదించారు. ఇంకా శైవమని, వీరశైవమని వైష్ణవమని ఎన్నెన్నో భిన్నంగా ఆవిర్భవించెను. మతాచార్యుల భావాలు వేరైన కారణాన ప్రజలలో కొంతవరకు వారి భావాలవలన ఐక్యత నశించి పోయినది. సిక్కు మతమూ, జైనమతము, బౌద్ధమతము పేరునకూడ ప్రజలలో ప్రజలకు విభిన్నాభిప్రాయములు కలుగు చున్నవి. ఇవే కాకుండ పీఠములు అనగా దత్తపీఠము, అచలపీఠము, నారదపీఠము, రాదాపీఠము, కాళి పీఠము యింకా ఎన్నియో పీఠముల ద్వార గురువులమని కొన్ని గుంపులను ఏర్పరచుకొనడం వల్ల మానవుల ఐక్యత యీ విధంబుగా కూడ చెడిపోయినది. ఆంగ్లేయుల కాలమందు బైబిల్, తురుష్కరాజుల కాలమందు ఖురాన్ ప్రచారము చేసి, ప్రజలలోను, ఆ మతములలో చేర్చుకోవడం ద్వార, భారతదేశంలో పుట్టిన మతాచార్యుల ద్వార ప్రజల హృదయాలు ఆయా మతాల భావాలపై చోటు చేసుకొనడం ద్వార, ఇలాగే ప్రపంచ దేశాలలో ఆయా మతాలవల్ల ప్రజల ఐక్యత నశించింది. బౌద్ధమతంలో ఇంకా హీనయానంఅని, మహాయానం యని, ముస్లీములలో సీయా–సున్ని యని, క్రైస్తవులలో (క్యాథలిక్ లు ప్రొటెస్టెంట్లు). ఏసు–మేరి యనే విపరీత భావాలు కలగడంద్వార ప్రజల్లో ఐక్యభావం పూర్తిగా నశించిపోయింది. భారతదేశంలో హరిజనులను వారు

యితరులు చిన్న చూపు చూడడం ద్వార, హరిజనులమని చెప్పిం
అభిమానం పోవునని క్రైస్తవ మతము స్వీకరించారు.

ఇలా మతాలు యేర్పడి, వారు వారి మతగ్రంథములను ప్రఖ్యాతి గాంచిన గ్రంథములని చెప్పుకొందురు. వారి వారి మతగ్రంథములను ఆ మతపు దేవుడు లిఖించెనని ప్రజలకు బోధించుచుందురు. అప్పటి మతములు యిప్పటి ప్రజలను చిన్నాభిన్నం చేయుచు వారి హృదయములలో ఏకత్వంను నశింపజేయు చున్నవి. ఇప్పటికి ప్రతిరోజు మతము పేరిట మారణహోమం జరుగుచున్న సంఘటనలు మనము ఎన్నియో తిల కించు చున్నాము. ఈ గ్రంథములు దేవుడు రచించెననుట ఎంత మూర్ఖత్వము. ఏ గ్రంథరాజమైనను మానవుడే రచించెనని నా భావన. కాదంటె జ్ఞాన సంపన్నుడైన మానవుడు లిఖించెనని వొప్పుకొందును.

అప్పటి కాలాను కూలంగా వ్రాసిన మత గ్రంథములను యిప్పటి వారిపై రుద్దుచు వాటిని (మతములను) రక్షించండి అని బోదించుచుందురు. యువకులలో పుదేక్రకమును పెంచి, మతోన్మాదులుగా మార్చి రక్తము కండ్ల జాచుచుండుట మన మెరింగియే యుందుము. ఆ కాలమునకు చెందిన మత గ్రంథములను మతాచార్యులు ఆయాకాలము ననుసరించి మానవులకు హితబోధతో తొడ్పడ్డారనియే చెప్పవచ్చును. ఇప్పటి కాలమునకు స[illegible] పడు యేదైన మంచి కార్యమునకు పూనుకొమ్మని నుటివినా మా మ[illegible] చార్యులు బోధించ లేదని, మా మతములో లేదని మూర్ఖంగా మాట్లా[illegible] చుండు వారిని నే నెందరినో గాంచితిని. వారి మత గ్రంథములో లేనం మాత్రాన, వారి మతాచార్యులు బోధించనంత మాత్రాన, మం[illegible] యలోచన మంచిదే కదా! రాను రాను ఆయా గ్రంథములపై అభి[illegible] నము హెచ్చె యిప్పటి పేరులు కొట్టుకొని మరణించుట మనము యెరిగిన[illegible] యుందుము. మతాచార్యులను, మత గ్రంథములను దూషించడం నా అ[illegible]

మతము కాదు. గత మత అభిమానమనే మత్తు యిలాగే పెరిగినచో మానవ జీవనంలో దావాగ్ని చెలరేగి యావత్ ప్రపంచమున ఒకరంటె ఒకరికి యిష్టము లేకుండబోయి, మానవజాతి తన మావవజాతినే సమూలంగా అంతమొదించుకొనుట తథ్యం. ఈ పుస్తకములు మంచివని కాదు. అందులో యెంతయో కొంత ప్రజలకు పనికిరాదని కాదు, కావున మనము తెలుసుకోక తప్పదు. జాగ్రత్తపడి వీటి పై అభిమానము విడుచుటే యిప్పటి ప్రజలకు శ్రేయస్కరము.

మతాల పేరిట సభలు, రహస్య సమావేశాలు జరుగుచుండడము మీరెరంగి యుందురు. ఒక మతము తెగవారు నరబలి చేయకుడని, మృచ్ఛలించకుడని నీతి వాఖ్యాలు బోధించుచూ వారి మతమును ప్రజలపై రుద్ద ప్రయత్నము చేయుదురు. అన్ని మతములు ఒక్కటేయని, అన్ని మతములు ఉండవలసినదని ప్రజలకు ప్రచారం చేస్తారు. ఇంకొక తెగ వారు అనుమానం వీడండి, అసూయలు వీడండి, సంకుచితం వీడండి, పరస్పర దుష్ప్రచారము మానండి యని యిలాంటి నీతి సూక్తులు వల్లిస్తూ అన్ని మతములు సమానమేయని బోధిస్తూ, వారి సంకుచిత ధోరణి మాత్రం ఆ మత ప్రవక్త అప్పటి నడకను ప్రచారం చేసుకోవడమే వీరి యొక్క ధ్యేయము. కాని వీరి లోన దురభిప్రాయం విడవజాలరు. వారి మతమును, దురభిప్రాయంను విడువరు. బయటికి చెప్పుకొనడమే కాని అప్పటి మూఢాచారములను ఇంకొకరు శాంతి శ్రేయస్సును, పేమాధారణలను, మానవ ఔన్నత్యాన్ని బోధిస్తారుగాని వారి ధోరణి మాత్రం అంతర్ముఖంగా మతంపైన మొగ్గుచూపు చుండును. ఇంకొకరు దైవభక్తిని మతవర్గాల మధ్య సుహృద్భావ సంబంధాలకై పునాదిని గట్టిగా వేస్తామని, ప్రతి గత మతవర్గం ఉనికిని గుర్తించి దాని హక్కును నెరవేర్చుకోవాలని శతృత్వం విడవాలని, స్త్రీల మాన, ప్రాణాలను రక్షిస్తాము యని బోధిస్తారు. హింస,

దౌర్జన్యాలకు వ్యతిరేకంగా నిలుస్తామని వారే ఎన్నో మూగ జీవులను హింసిస్తారు. పైన తెలిపిన మంచివాక్యములను లేదా ఏదో ఒక వాక్యమును తీసుకొని కరపత్రములను అచ్చువేయించి ప్రజలకు పంచుచు మేక వన్నె పులుల లాగ మంచి సూత్రం పేరిట మత సంబంధమైనటువంటి మూర్ఖపు ఆలోచనలను ప్రజలపై రుద్దుచుంటారు. ఈ లాంటి మంచి సూత్రములను చూసి కపట నాటక మతమువల్ల అన్ని మతములు సమానమే అని బోధించడం ద్వార "ఒక్కొక్కసారి జ్ఞానులు సహితము జ్ఞానము కోల్పోయి వారి బూజు పట్టిన నడకకు లోబడుచుందురు". యోచన పరులు ఎరుగ వలసినదేమనగా ఇస్లామి యని, హిందూ వని, క్రైస్త వమని లేక బౌద్ధమతమనివారి వారి మతాచార్యుల పేర గాకుండా నీతి సూత్రములను ఏమతము పేర లేకుండ కరపత్రాలు అచ్చు వేయించి యిచ్చువారిని, మరియు వారి హృదయములో గత మతాచారము విడచిన వారితో స్నేహం చేసినవాడు తనలో అసహ్యము, ద్వేషము పోవునేగాని వేరే విధంగాపోదు. ప్రతిహృదయం ముక్కచెక్కలైన సమాజము భగ్న హృదయాలుగా మారిననాడు ఈ మతం పిచ్చివలన శాంతి కరువై శవాల గుట్టలను తిలకించి ప్రాణమున్న వారి "హృదయఘోష" విని పించక మానదు. ఇలాంటి అరుపులు ఆకాశాన్నంటు కోకమానవు. కర పత్రములలో పైన అన్ని నీతి సూత్రాలు, క్రింద మాత్రం వాడిగతం, బూజు మతం. ఇంచుమించు అన్ని మత గ్రంథములలో ఎంతోకొంత మంచి బోధించిన ఎంతో కొంత చెడు అనాచారములు గలవు. అందులోని మంచిని పైన సూత్రాలురాస్తూ వాడి అనాచారమును, ఆ నీతి సూత్రాలపేర ప్రజలకు రుద్దుతారు. మంచి సూత్రాలు న, క్రింద వాడి మతం పేరు. ఇలాంటి మతమువారి మాటలు నమ్మకండి. మీ హృదయాలలో చర్చించి మీ శరీరంను ఆడించే చలనమును గ్రహించండి. మతముపై కరపత్రములను వ్యతిరేకించండి, ఒక మతాన్ని గురించి ఉపన్యాసించు వారిని వ్యతిరేకించండి.

మనమంతా ఒక్కటే యని హృదయ పూర్వకంగా అరచు వారి మాటలు తరచూ వినండి. కాని వారి మాటలు తరచి తరచి ఆదరించండి. ఇంకను యిలాంటి మతములవారు కొందరు 'రోగపీడితుడవై ఉన్నావా' "అయితే రండి మా కూటమిలో చేరండి" అనే వాఖ్యాలు గోడలపైన, కరపత్రములపైన మనము గాంచియే యుందుము. శరీరం ఆరోగ్యము లేకనో లేక మానసిక బలహీనత వల్లనో ఇలాంటి పిచ్చివారి మూఢనమ్మకములను నమ్మి ప్రజలు తండోప తండంబులుగా వెళ్ళుచుందురు. వారి ప్రార్థనలవలన రోగము తగ్గడమనేది అవివేకం కాదా? ఇలాంటి అవివేకపు ఆలోచనలతో అమాయక ప్రజలను మభ్యపెట్టి, మూఢావస్థలకు దించుచున్నారు. వాస్తవంగా రోగమన్నది వాడి మనస్సుకు పట్టిన మతమనే మూర్ఖపు ఆలోచన. ఇదే వాడి రోగము. చెప్పేవారిలో ఉన్న ఈ రోగం పోయేదెన్నడో, ప్రజలు ఐక్యత పడేదెన్నడో, కాబట్టి ఈ మూఢా వస్తనుండి జాగ్రత్తపడుడు.

భారత దేశములో ఎన్నియో గీతా గ్రంథములు గలవు. (భగవద్గీత, అష్టవక్రగీత, గురుగీతా) ఇంకా ఎన్నియో గ్రంథములు గలవు. ఆ పుస్తకముల నుండి ఏదోవొక వాక్యం తీసుకొని దాని ద్వారా ప్రచారం చేయుచున్నారు. ఆర్భాటం ఎక్కువ ఆలోచన తక్కువ. ప్రజలను మానసికంగా మార్చడం తక్కువ. మతోన్మాదులుగా చేయుటం ఎక్కువ. అప్పటి మతాచార్యులు యిప్పటి కొత్తగా మతంను ప్రజల్లో పుట్టించుచున్నవారి దోరణి వల్ల ఏల ఐక్యం కాగలరు. అహింసా సంఘాలు, సత్సంగాలు, స్వాధ్యాయన సంఘాలు, ఇంకా ఎన్నియో సంఘాలు వెలువడినవి. ఇలాగే మసీదులలో ఖురాన్ను గూర్చి ఉపన్యాసాలు, చర్చిలలో బైబుల్‌ను గూర్చి ఉపన్యాసాలు, ఆయా ఆలయాలలో ఆయా మతమునకు సంబంధించినవి చెప్పడం జరుగుచున్నవి. అవి వినగానే ఆయా ప్రజలు తబ్బిబ్బవ్వడం మూఢదే

గొప్పదంటే, మాదే గొప్పదని సంకుచిత భావం రావడం వల్ల ప్రజల్లో ఐక్యత చెడిపోవుచున్నది. ఇది తప్పని తెలిసినా మేధావులు సహితం నోరు మూసుకొని ఉండడం విచిత్రకరం. రాజకీయ వేత్తలు సహితం ఈ మత గురువులకు అనిగి మనిగి ఉండడం చూచుచున్నాము. ఎందుకనగా ఆ మతాచార్యుని శిష్యుల వోట్లవల్ల తనకు నష్టం కలుగునని మళ్లీ ఆ సీట్లపై నేను రాలేనేమోనని, వారికి భయపడి లొంగియుండుట మనము చూసియే యుందుము. నే చెప్పిన వాక్యములు సత్యములని అందరికి తెలిసిన, స్వమతాభిమానం విడువలేక దురాభిమానులై దూరదృష్టి లేనివారై పోవు చున్నారు. కొద్దిగా విచారించినచో, సత్యము సత్యమే, యని హృదయము ఘోషించుచుండును. ప్రపంచ ప్రజలందరు ఒకరిపై నొకరు ప్రేమను పెంచుకొని ఎవరి స్వేచ్ఛను అరికట్టకుండా మంచి తనాన్ని పెంపొందించు కొని బాగుంటారని ఆశిస్తున్నాను. ఐక్యభావన కొరకు వీరు మారేదెన్నడో! మనము చూసేదెన్నడో! మారినచో మహదానందమే.

ప్రపంచంలో ఉన్న ఈ మతవాదులు వారి మత గ్రంథములలోనే దేవుడు ఉన్నాడని నమ్ముతుంటారు. హిందువులు, ముస్లీంలు, క్రైస్తవులు జైనులు వారి మత గ్రంథముల రెండు అట్టల మధ్యన ఉన్న కాగితాలలో దేవుడు ఉన్నాడనుకోవడం ఎంత మూర్ఖత్వం. వారి వారి మతముల వారు ఈ పుస్తకముల ద్వారా మా హృదయం వికాసం చెందినదని యనుట మనము వినుచుందుము. వీరి వికసితం వొక పరిమితి మట్టుకే ఉంది కాని పూర్ణ స్వరూపంగా లేదు. ఈ పుస్తకాలపై స్వాభిమానం విడచి వాస్తవ ఆలోచన చేసినచో అంతా ఒకటె యని గోచరమగును. ఈ పుస్తకాలు, ఈ మతముల భేదములు ఉన్నంత కాలం ప్రపంచంలో అల్లకల్లోలం సృష్టించుకొని వారిని వారే సమూలంగా నాశనం చేసుకునే స్థితికి దిగజారి పోవుదురు.

ప్రపంచంలో యిప్పటి మానవులు ఏసు యని, మరియమ్మని అల్లా యని, రాముడని, కృష్ణుడని, కాళి యని ఎన్నియో రకరకాల పేర్లతో దేవున్ని పిలుచుకొనుచున్నారు. వాస్తవంగా పరిశోధనలో దేవుడు రాముడు కృష్ణుడు, అల్లా, ఏసు, అమ్మ యనుట ఇవి అన్నియు మానవులు ఏర్పరచుకొన్న భ్రాంతి మాటలు. మనము పుట్టినపుడు మన తల్లిదండ్రులు పిలుచుకొనుట కొరకు, వారికి గుర్తు ఉండటానికి ఏదో ఒక పేరును పెట్టుకొందురు. వాస్తవంగా తల్లిదండ్రులు పెట్టిన పేరు యిష్టం లేక తనకు నచ్చిన పేరుతో పిలిపించుకునే వారుకూడ గలరు. కనిపించే యీ భౌతిక శరీరమునకే యిన్ని పేర్లు మార్చుచున్నావు. వాస్తవంగా నీకు పేరు ఉన్నదా? ఈ గుర్తులకు ఉపయోగించిన పేర్లు నీ శరీరమునకు ఎలా తగిలించుకున్నావో కనిపించని నిరాకారమునకు రాముడని, కృష్ణుడని, ఏసు అని, నీ యిష్టమున్న పేర్లతో పిలుచుచున్నావు. ఇవి యన్నియు మానవుడు కల్పించుకొన్న మిథ్యా పేర్లేయని జ్ఞానులు యెరుంగగలరు.

మానవుడు మాట్లాడడం మొదలు పెట్టినప్పటి నుంది అనగా ప్రకృతిని గ్రహించే తెలివి వచ్చినప్పటి నుండి ప్రకృతిలో జనించిన కనిపించే భిన్న భిన్న వస్తువులకు భిన్న భిన్న పేర్లు నిర్ణయించుకున్నాడు. ఎందుకనగా వాటిని మదిలో ఉంచుకొనటానికి, మల్లి యితరులకు చెప్పటానికి ఆ పదములను ఉపయోగించుకొన్నాడు. అలా ఉపయోగించుకున్న పదజాలములు వారి వారి స్థలాలల్లో వారు పెంపొందించుకొన్న భాషలలో దేవుడని పేరు పెట్టుకొన్నారు. సృష్టి ఆదినుంచి అన్ని పరిశోధించినట్టుల మానవుడు తనను తాను జయించవలెనని సత్సంకల్పముతో తన శరీరమును మొట్టమొదటి సాధనంగా ఎన్నుకొన్నాడు. ఆ ఎన్నుకొన్న పరిశోధనలో కొందరు కొంత వరకే పరిశోధించి శరీర త్యాగమొనర్చిరి. తర్వాత వారి శిష్య పరంపర దాన్ని పరిశోధించి, పరిశోధించి వ్రాశ

నిగూఢమైనతత్వ రహస్యములను తెలుసుకొన్నారు. అలా తెలుసుకొన బోయిన మహాజ్ఞానులైన జీవులు ఆనందమయమై తన్ను తాను మరచి పోయి, యితరులకు చెప్పలేక నిరాకారమనిబోధించారు. కాని నిరాకార మనుట మానవుడు పలుకుట కొరకు వినియోగించే పదజాలమని మీరు గ్రహించగలరు. మన వాక్కులు కొన్నింటిని మాత్రమే వర్ణించును. మన జ్ఞానేంద్రియములు కొన్నింటిని మాత్రమే గ్రహించును. అలాగే బ్రతికుండగానే చలనముడిగిన మానవుడికి మానవుడు బోధించిన పరమ సత్యం.

జగత్ సత్య వాదులైన మహానుభావుల హితవచనంబులు జ్ఞానులు సహితము ఒక్కొక్కసారి అర్థము చేసుకొనలేక తికమక పడుచుండుట మనకు తెలిసినదే. కొందరు అలాంటి మహానుభావుని దగ్గర వుండికూడ ఆ మహాజ్ఞానిని అర్థము చేసుకోలేరు. వివిధ మతాచార్యులు ప్రతి పాదించిన దేవుళ్ళు యెప్పుడైనను వారికి కన్పించి నేను గొప్పంటే నేను గొప్పయని యెప్పుడైనను సమరంబు జేసిరా? లేక చర్చించిరా? సమరంబు చేసిరి యనుటకు సరియైన సమాధానమున్నదా? యిలా పోట్లాడు కొనిరి యని యెవరైన నుడివినచో, వారు శరీరధారులైన ప్రాణులేయని మనము వొప్పు కొనక తప్పదు. అలా చేసినచో అరిషడ్ వర్గములు (కామక్రోదాదులు జయించని) విడవని సామాన్య మానవులేయని నాయభిప్రాయము. ఎందుకీ గొడవ—మనయందరిది ఒకే జాతి, ఒకేకులం, ఒకే మతం అని చాటిచెప్పండి. లేనిచో మన మానవ జాతి ఐక్యత యిప్పటికె ఎంతో నశించినది. యికనైన మేల్కొనండి. ఇప్పుడు మానవజాతియేకాక సర్వం భస్మమయ్యే వరకు మన పరిశోధనలు సాగినవి. ఆ పరిశోధన ఫలితమైన సామాగ్రి యెప్పటికైనను దహించక మానదు. అందుకే బుద్ధి తెచ్చుకొని మన బీజమును, ఈ సుందర ప్రపంచమును బూడిద చేయబూనకండి

శాంతియుత వర్ధించే ప్రపంచ ఐక్యత కాక్షించండి. యెవరిని యెవరు నిర్బంధించని సామ్రాజ్యమును స్థాపించండి. యెవరి స్వేచ్ఛనైనను అరి కట్టకండి. అవి అందరికి హితమైయుండినయెడల. అందరి హృదయాలను నిర్మలము జేసె యత్నం చేయండి. ప్రపంచములో గల అన్ని హృద యాలను దయార్ధహృదయాలుగా మార్చండి. అప్పుడే గృహములో ఉండు కుటుంబికులు, అలా వొక్కొక కుటుంబము బాగుపడితె ఒక గ్రామము, అలా ఒక్కొక్క గ్రామము బాగుపడితే, ఒక్క మండలము, ఇలా మండలాలు బాగుపడుతే తాలూకాలు, తాలుకాలు బాగుపదితే జిల్లాలు, జిల్లాలు బాగుపడితే రాష్ట్రాలు, రాష్ట్రాలు బాగుపడితే దేశం, ఇలా దేశాలు బాగుపడితే ప్రపంచము. అనగా ప్రపంచ ప్రజలందరి హృదయాలు దయాలయాలుగా మారిననాడు ప్రపంచములో యింతకన్న ప్రగతి సాధించేవేము౦డును. ఇలా ప్రపంచములోగల ప్రతి పౌరుడు జ్ఞానంతో హృదయాంతరాళమున ఆలోచించి ఈర్ష్య ద్వేషములేని, నిష్కపట హృద యములుగా మార్చుకొన్ననాడె ప్రపంచ ఐక్యత సంభవించును.

ఇది వొక ఆలోచన. ఒక రకం వారు అందరి మతములు ఒకటే యని, అన్ని గ్రంథములు ఒకటేనని, అందరు చెప్పునది ఒకటేనని, అర్థం చేసుకొనలేక ఐక్యత లోపించు చున్నదని వొకతెగ వారి వాదన. యింకొక తెగవారు వారిమతములను, మతాచార్యులను అనుసరిస్తూ యితరుల మతంను దూషించకుండడం ద్వార ఐక్యత ఉంటుందని అంటారు. కానివారి వారి మతాభిమానం, మతాచార్యులపైన స్వాభిమానం రవ్వంతయిన చోటు చేసుకొనక మానదు. తద్వార ఆ చిన్న విషబీజమే మహావృక్షంగా మారి మారణకాండను దిగుచుండుట మనము చూసియే యుందుము. మతాచార్యుల పుస్తకాలు అన్ని స్వచ్ఛమని మాట్లాడిన మొదటి తెగవారు, అందరు చెప్పి నది సత్యమే యని బోధించిన వీరి వాదనను యితర మత స్వాభిమానం

ద్వార వారివారి మతములను ప్రోత్సహించడమే కాని, అన్ని మతములు, ఈ మతాచార్యులు ఏకత్వమందము కలలో కూడ జరుగని పని. ఇది చెప్పడం మట్టుకే గాని ఆచరణ శూన్యం. వారివారి మతాచార్యులను బల పరచునంత కాలము, అన్ని మతంబులు వొక్కటెయని పైకి పలికినా అంతర్ముఖంగా మనసొప్పక "ముసుగులో గుద్దులాడు"కునె వ్యక్తులు యెందరో గలరు.

జాతి ఐక్యత కాంక్షించు జ్ఞానులు మూఢావస్థలో వున్న వారి హృదయాలను మార్చినవాడు ప్రజల ఐక్యత సిద్ధించునని నా ఆశయం. ఒకరిపై ఒకరు దౌర్జన్యం చేసుకొనుట ఎవ్వరు సహించరు. అదియే స్వతంత్ర్యమును పాడుచేయును. అలాగె ఒక దేశంపై మరొకదేశం దౌర్జన్యం చేసినచో వారును సహించరు. అలాగే ఒకరిపైనొకరు ప్రేమానురాగాలు పెంపొందించు కొన్ననాడు మన స్వతంత్ర్యమునకు లోటుండదు. దౌర్జన్యం అనునది మనుష్యులలో ఐక్యత పాడుచేయును.నిస్వార్థమైన ప్రేమనే ప్రపంచ ప్రజలందరికి మూలసిద్ధాంతం కావలెను. అప్పుడే ప్రపంచ ప్రజలందరు నిర్భయులై జీవించగలరు. మానవులకు జంతువులకు భయమన్నది మానసిక ప్రవృత్తిలో ఒక భాగం. ఆ భయము పోవాలంటె అందరి ఆశయం వొకరిపై నొకరు ప్రేమను పెంచుకోవడమే, కలసికట్టుగా జీవించడమే పరమావిధి. మనస్సున్న మానవులము కాబట్టి ఏమయినను తప్పులు జరుగు చుండును. ఆ తప్పులను వారిలో వారు తర్కించుకొని, తెలియనిచో జ్ఞాను లను అనుసరించి ఈ తప్పులను సరిదిద్దుకొనవలెను. అలాంటి పరిష్కార మార్గం ద్వార ప్రపంచ మానవుల్లో ఐక్యత నిలుచును. ఆ చర్చ బహిరంగముగా నిష్పక్షపాతంగా వుండవలెను. అప్పుడే ఆ మాటలకు విలువ యుండును.

ఒక భాషవారు యింకొక భాష మాట్లాడు వారిని హేళన గావించుకొనుట మనము చూచుచున్నాము. భాషల కంటె, మనము మాట్లాడే మాటకంటె, మనం వ్రాసె వ్రాత కంటె, మనమంతా వొక్కటె యని, ఒకే గూటి పిట్టలమని భావనరావడం మంచిది. ఇలానే మన భావి పౌరులకుబోధించవలెను. నీచమైన, నికృష్టపు భావనలను విడనాడి మనమంత వ్యష్టినుంచి సమిష్టికి ఎదుగుచున్న జీవులమని ఈ భిన్న మార్పులనుండి ఒకేధ్యేయంపై నిలుచుండగలమన్న ధీమ అందరిలో రావలెను. అలా రాని నాడు మానవ ఐక్యతకు భంగం కలుగుట తథ్యం. ఇలా మనకు ఐక్యతను భంగకరము కలుగజేయు క్రియాపరులు ప్రపంచ దేశద్రోహులని నాఅభిప్రాయం. మరి మీరు కూడ ఆలోచించండి, మీరు ప్రపంచంలోని దేశద్రోహులా? మాతృదేశ శ్రేయస్సును కాంక్షించే మనుష్యులా ? విశ్వమానవ ఐక్యతకు భంగము గలిగించె నీతిమాలిన వచనములు పలుకుటకు దోహదపడు వారిని ప్రతి పౌరుడు మార్చి మానవాభ్యున్నతికి పాటుపడగలరు.

మొట్ట మొదట అందరి ఆది భాష మూగభాష. ఆభాష తర్వాతనే యితరులకు మనయొక్క భావములను తెలుపుటకు ఘంటము, తాటి కమ్మలను వాడేటి వారు. అప్పటి వేదములు, ఉపనిషత్తులు ఆది గ్రథములు. ఇప్పటికి సంస్కృత భాషయే ప్రథమ భాషయని అందురు వొప్పుకొనినారు ఆ తర్వాత ఎన్నియోభాషలు (తెలుగు, హిందీ, మరాఠి, మళయాలం. కన్నడం, అరవం, ఇంగ్లీష్, లాటిన్, కొరియ, అరబ్బి, ఉర్దూ మొ॥, భాషలు) ఆవిర్భవించినవి. ఒక భాష తర్వాత ఒక భాష పుట్టినదని నిర్ధారించడం కష్టమైన పని. తొలి మానవ ప్రాణి వుత్పత్తి అయి మార్పు చెందుచున్న కాలంలో మూగ భాషయని వొప్పుకొనక తప్పదు. అదే సంజ్ఞ భాష. ప్రపంచ ప్రజలందరు మన ప్రజలే యని, అందరం సోదరి

సోదరులమని ఒక ఐక్యభావమును ప్రతిపాదించుకోవాలి. ఒక్కొక్క దేశం లోని ప్రజలు తమ దేశైక్యతకు, ప్రతి దేశప్రజలు ప్రపంచ ఐక్యతకు పాటుపడాలి. ప్రపంచములోని అందరు ప్రజలు వారు ఉన్న దేశంను వారి మాతృదేశంగా భావిస్తారు. అందుకే భారతీయులు మన దేశంను భారతమాత అంటారు. వాస్తవంగా భారతమాత స్త్రీకాదు, పురుషుడు కాదు. మనము నివసించె భూమి మనం కలసిన ప్రేమ స్వరూపమే, ఐక్య స్వరూపమే మన భారతమాత. తర్వాత ప్రాంతీయ భాషల పేర కొంత ఐక్యత నశించుచున్నది. అది ఏలనగా మరాఠీ మాట్లాడు వాన్ని మహారాష్ట్రీయుడని, తెలుగు మాట్లాడు వానిని ఆంధ్రుడని, తమిళం మాట్లాడే వాన్ని తమిళుడని యిలా భాషలపేర కూడ మన యొక్క ప్రజలు ఆ రాష్ట్రం యొక్క ప్రజలమే అని భావిస్తూ దేశం ఐక్యతకు భంగము కలిగించు చున్నారు. దీనికి తోడు రాజకీయ వేత్తలు ప్రాంతీయ పార్టీల పేర, భాషలపేర ప్రజల ఐక్యత పాడుచేయు చున్నారు. ఇలా ప్రజల ఐక్యత నాశనంవల్ల దేశ ఐక్యత, దేశఐక్యత నాశనం వల్ల ప్రపంచ ఐక్యత పాడైపోవుచున్నది. కావున జ్ఞాన వంతులైన యువకులు దేశ ఐక్యతతో పాటు ప్రపంచ ఐక్యతను కాపాడవలసిన బాధ్యత ఎంతైన వుంది.

ప్రపంచంలోని మత ప్రచారకులు వ్రాసిన పుస్తకముల వలన ప్రపంచ ప్రజల ఐక్యత నశిస్తుంది. వీరందరు ఎవరి పుస్తకం వారికి గొప్ప దని, వారి పుస్తకమంత మంచిది ప్రపంచంలోఏపుస్తకము లేదని చెప్పుకొనుట మనము వినియే యున్నాము. ఈ మతాభిమానులు కొందరు అన్నిమతాలు ఒక్కటేయని చెప్పినా,తరచూ రహస్య సమావేశాలుచేసి అమాయక ప్రజలను పురేక పరచి ప్రజల మాన, ప్రాణములను బలిగొను చున్నారు. కావున గత మత పుస్తకాలు యిప్పటి ప్రపంచంలో ప్రజల ఐక్యతను పాడుచేయు చున్నవి. కాబట్టి ప్రపంచంలోగల మతములన్నియు ఏకమై, మేధావులను,

తత్త్వవేత్తలను పిలిచి అన్ని మత గ్రంథాల సారాంశము ఒక్కటి చేసి ప్రపంచమంతా ఇదియే పాటించవలెనని ఒక G. O. తీసిన యెడల ప్రపంచమంతా బాగుపడును. ఏ దేశంలోనైనను యిలాంటి చట్టములు ప్రభుత్వం తీసిన ప్రజలు దానిని విధిగా అనుసరించి నప్పుడే ఆ చట్టము అమలుకు వచ్చినట్లులెక్క. ప్రజల హృదయాలలో మార్పు రాకున్నచో ప్రపంచ దేశాల్లో ఎన్ని మార్పులు చేసినను ఫలితము శూన్యమని నా యభిప్రాయము. "ప్రపంచ ఐక్యత" గ్రంథమును వ్యతిరేకించిన వారిని దండించి ప్రపంచ ఐక్యతను కాపాడవలెను. ఇలా చేయడం ద్వార గత మత వాదం విడచి, ఒకే మతంగా "విశ్వమానవత" కళ్యాణమునకు అందరు నడుముకట్టగలరు.

ప్రపంచమునకు సరిపడు రాజనీతి, సర్వమతముల సమ్మత నీతి ఒకే గ్రంథముగా వ్రాయించి కట్టుదిట్టము చేయాలి. అలాచేసి ప్రపంచ సోదరులందరు ఒకటేయని చాటిచెప్పినపుడు ప్రపంచంలో సుఖము మాట యెలా ఉన్నా మనుష్యులచే మనుష్యులకు మాత్రము వైరము లేకుండ పోవును. వైరము లేకున్నచో అంతా ఐక్యతనే మిగులును.

వివిధ దేశములలో మతం ఎలా ఆవరించిందో అలాగే మన భారత దేశంలో కులం మత వ్యవస్థ బాగుగా ప్రాకుకొని పోయినది. చదువరులు సహితము కులము కులమని ప్రాకులాడుట మనము గమనించియే యుందుము. అసలు ఈ కుల వ్యవస్థ ఆదిలో ఏ మాత్రము లేదని జ్ఞానులు వొప్పుకొనియే తీరవలెను. నాగరికత పెరిగినకొలది, వంటా వార్పు నేర్చుకొన్న పిదప వృత్తులను బట్టి ఈ కుల వ్యవస్థ స్థాపితమై యుండవచ్చును. బట్టలు ఉమారు చేయువాని సమార్తె టన్నేవానితో కలసి పనిచేయడం కష్టంగా తోచునని, అదే వృత్తివారికి ఇచ్చినచో ఆ స్త్రీ దాపముగు నేయవచ్చు,

పురుషులు బట్టలు తయారు చేయుటం లాంటి పనులు చేసుకొని జీవింతురని పూర్వీకుల అభిమతము. రాను రాను ఈ వృత్తులే కులములుగా మారిపోయి మహావృక్షమై కూర్చున్నవి. ఇప్పటికెందరో మంది ఈ కుల నిర్మూలన కొరకు కృషిచేసి ప్రాణాలు కోల్పోయినారు. పూర్వము బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అను చతుర్వర్ణములను పూర్వీకులు ఏర్పరచినారు. ఈ చతుర్వర్ణంబులే కాకుండ పంచములని పిలువబడే హరి జనులను అంటరాని వారిగా పరిగణించుచు చులకనగా చూచుచున్నారు. అది దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వము వారికి తగిన సహాయము నొసంగి చేయూత నిచ్చుచున్నది. తద్వార యిప్పటికే ఎందరో మెరుగు పడినారు. ప్రభుత్వ సహాయమును "బూడిదలో పోసిన పన్నీరు" విధము కొందరు హారతికర్పూరం వలె హరింప జేసుకొని మళ్లీ ఎప్పటి లాగె తిరుగు చుండుట మనము గమనింపదగ్గ విషయము. పంచముడనగా అయిదవ జాతివాడని యర్థం. పూర్వం చతుర్వర్ణముల కట్టుబాట్లను దిక్కరించియో లేక వారికి నచ్చని పనులుజేసియో అప్పటి సంఘంలో వెలివేయబడ్డ మనుష్యులే ఈ పంచములు. అప్పటి వారి తాతలు తప్పుచేసిరో లేదో తెలియదుగాని యిప్పటి వారికి మాత్రము శిక్షపడుచున్నది. ఇదెక్కడి న్యాయం. ఒకరు తప్పులు జేసిన ఇంకొకరికి శిక్షపడుట మంచిది కాదు గదా, మన నాయన ఆహారం భుజించిన మన కడుపు నిండదు కదా. మనము ఆహారం తీసుకున్న మన పిల్లల కడుపునిండదుకదా. ఇలా కొద్దిగా ఆలోచించండి. ఈ కుల, మత నిర్మూలనకు బ్రహ్మనాయుడు "చాపకూడు" పేర భోజనంచేసిన సంగతి మీరు ఎరింగియే యుందురు. తద్వార నాగమ నాయకురాలు అతని వంశము సహితము నాశనము జేయు వరకు కంకణం కట్టుకొన్నది. కులవ్యవస్థ, మత వ్యవస్థ ఎంతటి మారణ హోమమును సృష్టించినదో ఈ చరిత్ర వల్ల తెలియుచున్నది. ఇప్పటికీ కులముల పేరిట

సంఘములు, ఆ సంఘములను బలపరచు కొరకు వారివారి మెంబర్లు డబ్బును జమచేసుకొని వారివారి మిథ్యా కులములను బలపరచుకొని మానవతనే కోల్పోవుచున్నారు. మనిషిని మనిషి కులము పేరిట హింసించుట ఎంతదురాచారము. ఈ కులవ్యవస్థవల్ల మనదేశ ఐక్యత చెడిపోవు చున్నదని నేను దృఢంగా విశ్వసించు చున్నాను. ఈ కులము మన జాతిని నిర్వీర్యము చేయుచున్నది. యువకులు కులాంతర వివాహము చేసుకొని మన జాతి సమైక్య భావమునకు కొందరు నడుము కట్టినారు. వారికి మనము జోహార్లు అర్పించక తప్పదు. ఇప్పటి యువకులు దీక్షనుబూని కులాంతర, మతాంతర వివాహములను చేసుకొని ఈ కులమనె వ్యవస్థను సమూలంగా నాశనం చేస్తారని ఆశిస్తున్నాను. కులాంతర వివాహాలు చేసుకొన్న వారికి పుట్టబోయే బిడ్డలను ఎవరుజేసుకుంటారని సంశయము మీకు రావచ్చును. నీ బిడ్డలను ప్రయోజకులుగా తీర్చిదిద్దిన ఎవరైన నీ పుత్రునకు భార్యనివ్వక పోదురా ? లేక నీ పుత్రికకు భర్తనివ్వక పోదురా ? అప్పటి వరకు యిసుమంతయిన మారక పోవునా! ఇప్పుడెందుకా చింత, కదులు ముందుకు.

యువకులు కులాంతర, మతాంతర వివాహములను చేసుకోదలచినచో వారి మూఢ మతులైన పెద్దలు అనగా తల్లి దండ్రులు, యితరులు వారికి అడ్డుగోడలుగా నిలుచుచున్నారు. ఇలాంటి అడ్డుగోడలను తప్పించ వారి హితులు వారికి సహాయపడుట కద్దు. ఇలా పెద్దలనెదిరించి పరినయంబాడి కొద్ది రోజులు సంసార జీవితాన్ని గడిపి శారీరక తృప్తిని బొందిన తర్వాత మానసికంగా కొందరు స్త్రీ పురుషులు పోట్లాట బెట్టుకొని విడిపోవు కొన్ని సంఘటనలను నేను తిలకించినాను. అలాంటి సంఘటనలు జరగడం ఎంత విచారకరము. పెండ్లి చేసుకునె ముందు యిరువురు మంచిగా యోచించి ఒకే ధ్యేయంపై నిలబడగల సమ్మతం, ధైర్యము పుంటుకొన్న

నాడే వీరు సంఘంలో పరిగణింపబడవలె. లేనిచో మూఢ విశ్వాసంగల మనను ఎదిరించిన వారు నష్టపడుదురు గదా, అందుకయినను మీరు కలసి జీవించవలె. పరిణయంబన్నది స్త్రీ, పురుషులను జీవితాంతము వరకు స్నేహితులుగా ఉంచవలెనే గాని, శత్రువులలాగ విడిపోకూడదు. సంసార మన్నప్పుడు ఒడుదొడుకులు ఉండనేయుండును. అందుకే "సంసారం సాగరం" అన్నారు. ఆ సాగరంలో ఆటు పోట్లకు సాగరుడు ఓర్చు కొనును. అదే విధంగా స్త్రీ పురుషుల కలయిక వల్ల ఏర్పడ్డ ప్రతి సృష్టి ఒక మహత్తరమైనది. కావున స్త్రీ పురుషులు ఒకరినొకరు అర్థము చేసుకొని సంఘంలో యితరులకు ఆదర్శప్రాయంగా కనిపించ వలెను. అలాంటప్పుడె యితరులు కూడ ముందంజ వేయటానికి అవకాశం ఉన్నది. మనం ఆచరించే భావాలు సత్యంబైనపుడు ఎవ్వరికి భయపడ నక్కరలేదు. మన నడక కూడ పవిత్రంగా సత్యంగా ఉండవలెను. అలాంటప్పుడే యితర స్త్రీ పురుషులు కులాంతర, మతాంతర వివాహాలు జేసుకొని మనకు చేయూత నివ్వగలరు.

ఈ కుల వ్యవస్థ అప్పటి కాలమునకు అనుకూలం కావచ్చును. కాని యిప్పుడది మహమ్మారిగా మారి మనను మ్రింగ దాపురించినది. నా దృష్టిలో కులమనగా జంతుకులము, వృక్షకకులము, పక్షికులము, జలాచర కులము మరియు మానవ కులము. వాస్తవముగా యితర ప్రాణులు ఒకే జాతిలో ఉండి కులమును పాటించవు కాని జ్ఞానమున్న మనుష్యులు ఎదుటి వారిని కులము పేరిట ఒకరి నొకరు బలహీన పరచుచున్నారు. ఓ బిడ్డల గన్న తల్లి దండ్రులారా! రవ్వంత మీ మనస్సు కరుగుట లేదా యోచించండి. మన వారిని మనమే హింసబెట్టుచున్నాము. ఇతర జీవులకు జ్ఞానం ఉన్న ఎడల మనలను జూసి సిగ్గు పడేడివి కదా. ఇప్పటికైన జ్ఞానంబు తెచ్చుకొని మీ బిడ్డలకు అడ్డు పడవద్దు. వారి స్వేచ్ఛను అరికట్టవద్దు,

వాస్తవం గ్రహించలేనగున జ్ఞానోపదేష్టలుగా తీర్చిదిద్ద గలరని మీ సోదరుడు ఆశిస్తున్నాడు.

భారత ప్రభుత్వము హరిజనులకు, గిరిజనులకు, వెనుక బడిన తరగతుల వారికి చేయూత నిచ్చుచున్నది వాస్తవమే. హరిజనులలో **(S.C.)** కూడ ధనవంతులు గలరు. గిరిజనులలో **(S.T.)** కూడ, వెనుకబడ్డ తరగతి **(B.C)** వారిలో కూడ ధనవంతులు గలరు. అలాగే **F.C** వారిలో ధనహీనులు గలరు. ఈ కులం వలన ధనహీనులకు, బలహీనులకు కొందరికి అన్యాయం జరుగుచున్నది. వెనుక బడిన **(B.C.)**, హరిజనుల, గిరిజనులలో ఉన్న ధనవంతులు అమిత ధనవంతులగుచున్నారు. దీన్ని ప్రభుత్వము దృష్టిలో ఉంచుకొనవలెను. గ్రామ ప్రభుత్వ అధికారికి, ప్రజలతో ఎన్ను కొన్న అధికారికి ఈ విషయములు కొట్ట వచ్చినట్లు కానవచ్చును. "ముంజేతి కంకణంకు అద్దమేల?" అన్నట్టుల వీరు బలహీనులని తెలిసి కూడ (**(F.C.)** లో పుట్టడం ద్వార) వారికి చేయూత నివ్వలేక పోవుచున్నారు వారిబాధను చూసి కూడ చూడనట్లు పోవువారలెందరో కనపడుచున్నారు అయిన అధిక సంఖ్య హరిజనులలో, గిరిజనులలో నికృష్టపు జీవితం యించు మించు కొన్ని సంవత్సరాలనాటి నుంచిగడుపు చుందేవారు. ఇప్పుడు కొద్ది? మెరుగైనదని తలంచవలెను. ఏదో కొందరికి అన్యాయం జరుగుచున్నద మనం బాధపడనక్కరలేదు. ఇప్పుడు యించు మించు అందరు మెరు పడిన సూచనలు కన్పిస్తున్నాయి. అందుకే ధనహీనులకు, వెనుకబడి వారికి ప్రభుత్వము సహకరించినచో మనదేశ భవిష్యత్తు అందమైన సుంద వనంగా మారిపోవును.

అగ్రకులాలమనేవారు వేరేకులముల వారితో వెట్టిచాకిరి చేయించుకొన్న సంగతి మీరు యెరింగియే యున్నారు. ఒక ఊరి దొరను చూసినప్పుడు ఆఊరి ప్రజల మాన, ప్రాణరక్షణ లేక విలవిల కొట్టుకొని తన్నుకొన్న

కాలాలు ఉన్నవి. దొర భూములలో కలువదోఘిన తల్లులు పిల్లలకు పాలు యివ్వని కాలంబులు కూడ ఉన్నవి. అప్పటి దొరల ముందర నుండి పోయేకాలమందు చెప్పులు చేత పట్టుకుని పోయే ఆచారము నిన్న మొన్నటి వరకు ఉండెనని మీరు గ్రహించగలరు. వీరి ఆగడములు మితి మీరిన కారణంచే ప్రజలు ఎన్నుకొన్న ప్రభుత్వము వారి ఆటలను కట్టివేసినది. భూములకు సీలింగు వేసినది. తద్వార పేద ప్రజలకు భూములనొసంగెను. ఇలావారి పెద్దరికం డిగజారిపోయినది. సంవత్సరాంతరబడి అప్పటి నుండి యిప్పటి వరకు మానవున్ని మానవుడే ఒక చేతి కర్రలాగ వాడు కొనుచున్నాడు. ఇప్పుడిప్పుడే ప్రజలు మేల్కొనినారు. వీరి అజ్ఞానం నశించి ఈ విషయమున జ్ఞానం సంతరించుకున్నారు. తద్వార వీరి ఆటలు కట్టుఅయినవి. వీరికి ప్రభుత్వము ఎంతో తోడు ఉన్నది. పల్లెలలో పని చేయు చున్నప్పుడు (కలుపు తీయువేళ, కోయువేల) ఎన్నియో వారికి తెలియ కుండానే కొన్ని పాటలను శరీరశ్రమ మరచిపోవడానికి పాడుచుందురు. ఆ పాటలనె జానపదగేయాలని చెప్పుచున్నారు. ఈగేయాములు వివిధ దేవుళ్లపై, తత్వాలపై, శృంగారముపై ఇంక ఎన్నియో రకాలు గలవు. ఆలాగే భారతీయ భాషలలో సంగీత పరముగా కీర్తనలు రంచించిన వారు ఎందరో గలరు. వాటిలో కొన్ని వైరాగ్యాపరంగాను, కొన్ని భక్తి పరంగాను, కొన్నిశృంగార పరంగాను, కొన్ని వీరరసంనొలకించునవిగాను. కొన్ని హాస్యాన్ని వొలికించేవిగాను, యించుమించు నవరసములు వొలికే గేయాలను మన రచయితలు లింఖించిరి. వాటిని కొందరు సంగీత విద్వాంసులు బాణీలు కట్టి పాడుచున్నారు. వాగ్గేయ కారులు, హరిదాసులు వివిధ రకాలుగా పాడుకొను చుందురు. ఇందులో కొందరు రామభక్తి, కొందరు కృష్ణభక్తి, కొందరు ఈశ్వరభక్తి, కొందరు మాతభక్తి, కొందరు ఏసుభక్తి, కొందరు అల్లాభక్తి (ఉర్దూలో) యిలా ఎందరో కీర్తనలు చేసినారు. ఆ సంగీతం చెవులకు యింపుగా ఉండును. కాని వీరి

వేరు వేరు దేవుని పేరున ఉన్న దైవశక్తి మూలమున దేవుళ్లు వేరువేరుగా ఉన్నారని ప్రజలు అర్థం చేసుకొని ప్రజల్లో ఐక్యత నశించింది. హరిదాసులనె వారు ఒక కథను తీసుకొని పద్యాలు, పాటల రూపంలో గానం చేయుచు ఎన్నియో దేవుళ్లు కలరని భిన్నభిన్న అభిప్రాయాలతో కీర్తించుటద్వార ప్రజలలో దేవుళ్లపేర ఐక్యత దెబ్బతిన్నది.

ఇక వీర రసంద్వారా యువకులలో, ఉత్తేజం కలుగజేసే రచనల ద్వారా మానవులలో కోపోద్రేకములు పెరిగి సమైక్యత భావం నశించుచున్నది. ఈ వీరరసం యుద్ధకాలమందు మనము పరదేశీయులచే పీడింపబడినప్పుడు ఈ గేయములు సైనిక మహానుభావులు వినినచో వారి శౌర్యము ద్విగుణీకృతమై మనను కాపాడుట నిత్యము. ఇంటిలో యే వస్తువు ఎక్కడ ఎలా ఉండునో అక్కడ ఉంటేనే అలంకార ప్రాయముగా మనకు గృహము కనిపించును. అలాగే ఏ రసమును ఎక్కడ వుపయోగించాలో అక్కడ ఉపయోగించిన యెడల మనదేశైక్యత నశించదు. శృంగార రచనల ద్వారా ఈ కాలము యువకులను నరాల బలహీనతకు గురిచేయుచున్నదని ఎరుంగవలెను. శృంగార రచయితలు వాటిని అచ్చు వేసి అమ్ముకునేవారు, యువకుల బలహీనతను ఆసరాగా చేసుకొని సొమ్ము చేసుకొనుచున్నారు. ఇలాంటి శృంగార నవల రచనల ద్వారా యువకులలో మనో చాంచల్యమేర్పడి ఉద్రేకపరచి మన భారతదేశమున యెన్నియో అరాచకము లేర్పడుచున్నవని మీరెరింగియే యుందురు. మధ్య కాలంలో శృంగారమును ఒక పవిత్ర కార్యంగా భావించేవారు. అది సృష్టి కార్యమని శాంతి మనస్కులై పిల్లల కనుట కొరకు మాత్రమే ఆ యొక్క కార్యమును జరిపేడివారు. ఇప్పుడిది రచనల నుండి తెరపైకి ఎక్కి (సినిమా) ఎన్నియో నగ్న చిత్రములను చూయించడం ద్వారా యువకులలో శృంగార కోర్కెల్ను జనియించి పెండ్లి అయిన కాంతలను గూడ జెరచు

చుండుట మనము ఎరింగియే యుందుము. పట్టణం నుండి పల్లెటూరు వరకు గోడలపైన జంట దృశ్యాలు, అర్ధనగ్న దృశ్యాలు, నగ్న దృశ్యాల పోస్టర్లను చూసి చదువుకునే యువకులు, పిల్లలు చేతులలో పుస్తకాలు, భుజాన బ్యాగులు వేసుకొని దారిలో గోడలపైన ఉన్న పోస్టర్లను చూస్తూ నవ్వుకొని పోవుచుందురు. కొందరు అది ఏమి వింతనో యని చూస్తారు. కొందరు ఆ పోస్టర్లను చూస్తూ ప్రక్క దృష్టిలేని కారణాన వాహనాల బెడదవలన వారిని ఢీకొని మరణించియుండుట మనము యెరింగియే యుందుము. కావున యిలాంటి చిత్రాలను, యిలాంటి రచనలను మనము వ్యతిరేకించవలసిన అవసరం ఉన్నది. పిల్లలు అలాంటి సాహిత్యం, అలాంటి చిత్రములు (సినిమాలు) చూడకుండ చూసే బాధ్యత ప్రతి తల్లి దండ్రులకు ఎంతైన వుంది. యువకులలో ఉడుకురక్తం ఎక్కువ. కొందరు ఉద్రేకపడకుండా ఆలోచించేవారు, కొందరు వుద్రేకపడువారు గలరు. ఆ బలహీనతను ఆసరాగా తీసుకొని రాజకీయ వేత్తలు, కుట్ర దారులు, స్మగ్లింగ్ దారులు, దేశద్రోహులు వారిని ఉపయోగించుకొను చున్నారు. అందులోని కొందరు యువకులు అర్థం చేసుకొని వ్యతిరేకించుట చూచుచుందుము.

శరీరం ఎదిగినప్పటికి, మానసిక బలహీనత కారణాన ఎక్కువ శాతం ఏదో ఒక బలహీనతకు గురియవుచుందురని నా యభిప్రాయము. మన మానసిక బలహీనతను ఆసరాగ జేసుకొని పైన తెలిపిన వారు మనతో ఎన్నియో పనులు చేయించుకొనుచున్నారు. కాని మానసికంగా మంచి చెడుల విమర్శనచేత మంచిగా ఆలోచించి మన మానవత్వానికి, ప్రజల ఐక్యతకు భంగకరము కలిగించె ఆయా రచనలను వారు జెప్పు వుద్రేక పూరితములైన పలుకులను విడనాడ ప్రతినిశ్చయులై యుండవలెను. ఉద్రేకపూరితమైన రచనలు యువకులను దప్పుద్రోవను పట్టించుచున్నవి.

ఉద్రేకపూరితమైన గేయాలు ద్వారా యువకుల హృదయాలలో చంచలత్వం ఏర్పడును. ఈ ఉద్రేకపు వచనములు, గేయాలు మన దేశముపై యితరులు దండెత్తివచ్చు కాలమున, యీలాంటి ములుకులు యీ ప్రవచనములు, ఈ మాటల ద్వారా దేశమును రక్షించే మహా కర్మయోగులయిన సైనికుల చెవిన పడగానే మన దేశమును రక్షించుకొనవలెనని భావములు కలిగి ప్రతాపవంతులై దండెత్తి వచ్చిన సైన్యాన్ని చీల్చి చెండాడుదురు. ఇప్పటికే వీరరసం పొంకబోసి రెండవ ప్రపంచ యుద్ధం జేసిరి. అందులో ఎందరో ప్రాణాలు కోల్పోయినారు. ఇప్పుడు మూడవ ప్రపంచ యుద్ధమునకు సన్నద్ధులై అణు బాంబులను తయారు చేసుకొన్నారు. మనము ప్రపంచ శ్రేయస్సును కోరి (అనగా ప్రపంచ మానవ శ్రేయస్సును కోరి,) యుద్ధములను నివారింపవలెను. శాంతిని పెంపొందించుకొనవలెను. ఈ శాంతి కావలెనన్న ప్రజానీకంలో ఐక్యత భావనరావాలి కదా!

ప్రశాంత మనస్కులైన, పవిత్ర హృదయులైన, నిండుహృదయు లయిన యువకులలో యిలాంటి రచయితలు వారి హృదయాలను అపవిత్రం చేస్తున్నారనే అనుకోవాలి. ప్రజలలో ప్రశాంత జీవనాన్ని పాడుజేసే ఈ వచనములు, ఉపన్యాసములు, గేయాలు, ప్రజలు మరియు జ్ఞానపరులైన యువకులు తిరస్కరించవలెను.

ప్రశాంతమైన మనస్కులు ఎన్నియో కార్యములు జేసిరని మనకు చరిత్ర ద్వారా తెలియుచున్నది. "ఉపాయమున్నవాడు ఉపవాసముండడు" కదా. యనే సామెత సమంజసము. ఆలోచనా శూన్యులు వుద్రేకపడి సమస్యలతో చిక్కుకొని మరణించిన కాలములు అనగా దేహత్యాగం చేసినవి సృష్టిలో ఎన్నియో చరిత్రమూలంగా తెలియనగును. ఉద్రేకపడి, కష్టనష్టములబడి మానవుడు తుదకు ప్రశాంతత కోరుకుంటాడు. కావున యిప్పటినుండే చెడు వ్యసనములకు బానిస కాకుండా మన కాలాన్ని

వృధా చేయకుండ దేశమునకు పనికివచ్చే కార్యములను కనిపెట్టవలెను. యువకులలోనే కాకుండా వృద్ధులలో, మాతృ స్వరూపమైన స్త్రీలు మత్తు పదార్థములకు బానిసలయిన వైనము. యువకులు జూదము, జారత్వం మొదలైన చెడు వ్యసనములకు బానిసలు అవుచున్నారు, వీటిని మానిన నాడు దేశ ఐక్యతే కాకుండా యావత్ ప్రపంచ ఐక్యత గలుగును.

పూర్వకాలంలో రాజులు అందరు యించుమించు కళలను పోషిస్తూ పండితులను, కవులను పోషిస్తూ వుండేవారు ఆశ్రమ పాఠశాలలను నెలకొల్పి, ఆచార్యులకు నిత్యావసర వస్తువులను సమకూర్చుచుండేవారు. అప్పటి విద్యార్థులకు ఆచార్యులు వ్యాకరణము, తర్కశాస్త్రము, ఖగోళ శాస్త్రము, ప్రపంచమున బ్రతికే ఉపాయ విద్యలు బోధించెడివారు. రాను రాను ప్రపంచంలో మార్పుగలిగి, మానవులు ఏర్పరచిన వోట్ల రాజుల వరకు వచ్చినది. ఈ వోట్ల రాజుల కాలంలో ప్రభుత్వం వారు ఎన్నియో పాఠ శాలలను, కళాశాలలను నిర్మించిరి. ఇప్పటి విద్యార్థులకు ప్రభుత్వము వారు ఎన్నియో సదుపాయములు కలుగజేసినారు అందులో కొందరు మాత్రమే విద్యను పూర్తిగా అభ్యసిస్తున్నారు. పార్టీల పేర వీరిలో ఐక్యత నశిస్తుంది. విద్యాలయాలలో ఎన్నికలవల్ల కూడా ఎందరో ప్రాణాలు కోల్పోయిన సంఘటనలు మనము తిలకించదగును. అలాగే విద్యార్థులను రాజకీయ వేత్తలు పార్టీలలో చేర్చుకొనుట, ఆ విద్యార్థులు విద్యను, పుస్తకాలను ఆ పాఠశాలల, కళాశాలల గోడలకు వదిలేసి రాజకీయాలలో చేరుట శోచనీయం.

విద్యార్థులు జిత్తుల మారి రాజకీయ నాయకుల వినయపు వాక్కులకు లోబడుచున్నారు. విద్యార్థులలో ఈ రాజకీయవేత్తలు చిచ్చురేపి వారి వారి పార్టీలను బలపరచుకొనుచు, అందులో తెలివిగల మనుషులను ఏదో ప్రలోభపెట్టి నిష్కళంకమైన విద్యార్థి లోకంలో పార్టీలను ప్రవేశపెట్టించిరి.

తద్వార విద్యార్థులలో ఐక్యత చెడిపోయినది. కావున విద్యార్థి, విద్యార్థినులు వీరి మాటలకు స్వస్తిచెప్పి వీరిని తిరస్కరించవలెను. ఏలయనగ నీ తల్లి దండ్రులు వారు ప్రేమించుకొనే కాలమున, గర్భధారణ జరిగిన పిదప ఎంతో సంతోషపడుచుండుట ప్రకృతి సైజము, ధర్మము. వారి ప్రేమ చిహ్నమును తీర్చిదిద్దగోరి, నా బిడ్డకు కష్టము కలిగించకూడదనే భావంతో చదువు చెప్పించు చుందురు. ముద్దుమురిపెములతో లాలించుచుందురు. గ్రామీనులైతె కాయకష్టము జేసి ఆ తల్లి దండ్రులు ఈ లౌకిక విద్యనార్జించే విద్యార్థికి డబ్బులు పంపించు చుందురు. చిన్ననాటి నుండి మాతృమూర్తి తన రక్తాన్ని పాలగా మార్చి యిచ్చిన సంగతి మరచిపోయి, వారు కష్టించి డబ్బును పంపుచున్న విషయం మరచి, వారు కన్న కలలను గంగలో కలుపువారు ఎంత అధములు. ఆ చదువు అబ్బని చెడిపోయిన విద్యార్థులను జూసి ఆ తల్లి దండ్రులు దుఖించు చుండుట గమనించ దగ్గ విషయం. వాళ్ల ప్రేమ గుర్తు, వారికలల తీపి విషముగా మారినారని, తన పుత్రుల హృదయంలో చేదు బీజము నాటిన ఆ రాజకీయ వేత్తలను, కుతంత్రవాదులను తిట్టు చుండుట మనము గమనించదగ్గ విషయం. కావున విద్యార్థిలోకం వీటన్నిటి యెడ ఆలోచించి, కనిపెంచిన తల్లి దండ్రులను దృష్టిలో పెట్టుకొని ఒక నిర్ణయం తీసుకొనుట మంచిది

ఈ జిందాబాద్, ముర్దాబాద్, డౌన్ డౌన్ గుంపులో జేరి వొర్లడం ద్వార విద్యార్థులు ఒక్కొక్కసారి పోలీసుల లాఠీ దెబ్బలకు, (బాష్ప వాయువు) తుపాకి కాల్పులకు గురయి మరణించిన సంఘటనలు ఎన్నియో గలవు. వారు ప్రాణాలు కోల్పోవుట వల్ల వారి తల్లి దండ్రుల అద్దాల సౌరభం ముక్కలు ముక్కలుగా మారిపోవును, వారిశోకమును మాన్ప ఎవ్వరి తరంగాదని నాఅభిప్రాయము. కావున జాగ్రత్తపడి తన

తల్లిదండ్రులకు ఏదైన యున్నచో తెలిపి వారి నిర్ణయం తీసుకొని అసగా చర్చించి యిలాంటి విషయంలో జోక్యం చేసుకొనవలెను. ఒక్కొక్క కాలమున యీ విద్యార్థిలోకమునకు యిలాంటి అవసరం లేకుండనే నిర్ణయం తీసుకొన వలసి వచ్చును. తనయొక్క దేశ స్వతంత్రము కోల్పోవు వేళ తన ప్రజల మాన, ప్రాణాలు బలియైపోవు వేళ వారే తన దేశమును రక్షించుకొన యిలాంటి మహత్కార్య కార్యములకు చేయూత నిచ్చిన సంఘటన లెన్నియో గలవు. కావున విద్యార్థిలోకం విచారం ద్వార తనలో తాను నిర్ణయించుకొని వొక నిర్ణయంకు రావలసిన అవసరం ఉన్నది. అది ఉద్రేక పూరితంగా ఉండకూడదు. ఎందుకనగా ఉద్రేక పరుల ఉచ్చులో తగులుకొని నీచగతి పొందిన విషయం గ్రహించగలరు. రాజకీయ వేత్తలు (కొందరు) యిలాకూడ విద్యార్థులను, ప్రజలను పార్టీల పేర వారి ఐక్యతను విచ్ఛిన్న కరంగా చేస్తున్నారు.

ఇప్పటికే ప్రపంచ దేశాలలో పార్టీలపేర, ప్రాంతీయ పార్టీలపేర రాష్ట్రాల విభజనకు గురయి తునాతునకలుగా అయిపోవుచున్నవి. కొన్ని పార్టీలు శాంతియుతంగా, కొన్ని హింసాయుతంగా బయల్వెడలినవి. శాంతియుతంగా వెలువడ్డ పార్టీలలో అశాంతి చోటుజేసుకొని వారిలోవారె పోట్లాడుకొని దేశప్రజలను విచ్ఛిన్నం గావిస్తున్నారు. ఇక హింసావాద పార్టీలు ప్రజలను భయపెట్టి వారి నిత్య జీవనానికి భంగకరం కలిగించు చున్నారు. కొందరు యువకులు శారీరక శ్రమ లేనందున రోడ్లపై గుమి గూడి వాగుచుండుట మనము గాంచుచుందుము. పని ఉన్నవారిని కూడ పని చేతనగాని పని దొంగలు ఏదో రూపంగా వారి సంఘంలో సభ్యునిగా చేర్చుకొని జిందాబాద్, జిందాబాద్ అనిపించుచుందురు. దీని వెనుక ఏదో రాజకీయ కుతంత్రపు, జిత్తులమారి నాయకీయముండును. ఈ గుంపులను రాజకీయ ప్రచారాల్లు వారి స్వార్థం కొరకు ఉపయోగించుకొందురు.

వారి కార్యములకు డబ్బులను ఖర్చుపెట్టి గ్రామంలో ఉన్న ప్రజలకు కొందరికి కూలి డబ్బులిచ్చికూడ తీసుకొని వచ్చి ఈ జిందాబాద్ కార్యక్రమములు జరుపుచుందురు. ఈ జిందాబాద్‌ను నిర్వహించువారు, ప్రభుత్వం వారికి ఏదో చేయలేదని, నాయకులు వారిలో ఏదో పొందాలనేఆశతో స్వార్థయుతమైన ఆలోచనతో ఆ సంఘములో ముర్దాబాద్, జిందాబాద్ అనుటకు ప్రజలు వెళ్లుచుందురు. ప్రజలు మానసిక శ్రమ, శారీరక శ్రమ లేకుండడం ద్వారా ఏవియో పిచ్చి ఆలోచనలు వచ్చి ఆ కుతంత్రపు రాజకీయ వేత్తలకు అండదండలుగా నిలుచుచుందురు. "కార్యము వెనుక కారణము" ఉన్నట్లు కొందరు రాజకీయవాదులు పదవిలో ఉన్నవారిని పదవినుంచి దించాలనే భావనతో ప్రజలను యిలా గుమిగూడ్పించి జిందాబాద్, ముర్దాబాద్ అనిపించడం ద్వార వీరి స్వార్థం వల్లఎందరో మంది ప్రాణాలు కోల్పోవుచున్నారు. ఇలాంటి నీతిమాలిన రాజకీయవాదుల బారినుండి తప్పించుకొన ప్రజలు ప్రయత్నించవలెను. ఇటువంటి రాజకీయ పార్టీల పేర ఐక్యత లోపించి కొట్లాటలు జరిగి రక్త పాతమును సృష్టించును. మనమంతా ఐకమత్యంగా ఉండాలంటే రాజకీయ పార్టీలకు చాలదూరంగా నుండాలి. పార్టీ పేరును చూడకుండ వ్యక్తి గత మంచితనంతో యోచించి వోటును వినియోగించుకోవాలి. ఆనాడే దేశములో ప్రజలు ఐక్యముగా నుందురు. మంచివారిని ప్రజాప్రతినిధులుగా ఎన్నుకొనుట ద్వారా దేశ ప్రగతి ఎంతయో మెరుగుపడును. దేనికైనను చర్చయే పరిష్కారము. కావున పరిష్కరించుకొనుటే ఏ దేశం వారికైనను కుదిఘట్టము. ఈ రాజకీయమే కాకుండ యువకులు మత్తు సేవిస్తూ వారి సుఖమయమైన జీవితాన్ని దుర్భరం చేసుకొనుచున్నారు.

ఈ మత్తు పదార్థం ద్రవరూపములయిన ఆల్కహాల్, మరియు కల్లు బీరు, బ్రాంగీ, విస్కీ, జిన్, రమ్, వైన్ మొదలగునవిఎన్నో గలవు,

వీటికి ప్రజలలో యించుమించు ౯౫% బానిసలయినారు. ఈ మత్తు పదార్థం సేవించడం ద్వారా నరాల బలహీనత, ఉద్రేకత, తద్వారా కుటుంబంలో కలహములు జరుగును. భార్యా భర్తలలో విరోధాలుగలుగును. ఇలా ప్రజలలో అనేక రకాలుగా ఐక్యతను దెబ్బతీయడానికి ఈ మత్తు దోహదకారిగా పనిచేయుచున్నది. కావున ఈ మత్తును విసర్జించవలెనని నా అభిప్రాయము. ఈ కల్లు ఈతచెట్టు ద్వారా, తాటిచెట్టు ద్వారా, కొబ్బరిచెట్టు ద్వారా గీసి జమచేసి అమ్ముచుండుట మనము ఎరిగియే యుందుము. ఇలా గీయడం ద్వారా కొందరికి (గీతకార్మికులకు) ఉపాధి కల్పించబడు చున్నది. ఆ కల్లును సీసాలలోనింపి కమీషన్ ఏజెంట్లకు యివ్వడం ద్వార యింకొందరి కార్మికులకు భృతి కల్పించబడుచున్నది.

సారాయిని మన ప్రభుత్వము తయారుచేసి ప్రజలకు అందించడం ద్వారా అలా కొందరికి ఉపాధి కల్పించబడుచున్నది. బీరు, బ్రాందీ, విస్కీ మొదలగు వాటిని తయారుచేసి అమ్మడం వల్ల కూడ కొందరికి ఉపాధి కల్పించుట జరుగుచున్నది. కాని ఈ కల్లు, సారాయి, మొ॥ మత్తు పదార్థాల వల్ల ప్రజలు ఎందరోవారి మాన, ప్రాణములను, ధనమును కోల్పోతున్నారని అనుభవపరులు ఎరింగియే యుందురు. ఈ కల్లు, సారాయిద్వారా ప్రభుత్వమునకు (ఆబ్కారి శాఖకు) సాలీన కొన్ని కోట్ల రూపాయల ఆదాయం ఉన్నది. ప్రభుత్వ బడ్జెట్ మెలాపున్నా ప్రజలకు మాత్రం ఈ మత్తు పానీయాలు కష్టనష్టములను కలుగజేయుచున్నవి. ఈ మత్తుకు బానిసలయినవారు ఆ మత్తులో ఎన్నో హత్యలు, మానభంగాలు దొంగతనాలు చేసినవి కూడా గలవు. ఈ మత్తువల్ల ప్రజల ఐక్యత నశించు చున్నది. ఈ మత్తుకోవకు చెందినదే గంజాయి. ఈ గంజాయిని పైపేలాంటి ఒక పరికరములో నలిచి అందులో ఉంచి కొబ్బరి పీచును కాల్చి, ఆ అగ్నిని పైపుపైభాగమున పెట్టి పొగను పీల్చుచు ఆ మత్తులో ఆనందముందని ఊహాలోకంలో

చరించెవి యువకులు ఎందరోగలరు. కొందరు మూర్ఖులు దీనిని సిద్ధపత్రి అని అంటారు సిద్ధులే సేవిస్తారు మనవేముందంటారు.

వాస్తవముగా యీ గంజాయికి యువకులు అలవాటుపడి బానిసలై జీవితాంతం విడువని వారు ఎందరో గలరు. ఈ గంజాయి సేవించి ఊపిరి తిత్తులు చెడిపోయి రక్తము గ్రక్కుకొని దేహత్యాగము నొనర్చిన వారు ఎందరో గలరు. యువకులతో పాటు వృద్ధులు, స్త్రీమూర్తులు కూడ సేవించుట నా కండ్లార గాంచితిని. ఈ మత్తు పదార్ధం ద్వార మానవుల బుద్ధి మధ్యమైపోయినది. అదిలేని కాలములో పిచ్చివారి వలె మాట్లాడుచు, పిచ్చివారివలె తిరుగుచుందురు. ఇక దీనినుంచి ఉత్పత్తి అయినది నల్లమందు. ఈ నల్లమందు చిన్నగోలీలుగ జేసుకొని దవడ క్రింద ఉంచుకొందురు. అలా కొందరు మత్తును ఆస్వాదిస్తారు. దీన్ని దవడల క్రింద ఉంచుకొన్నట్లయితే లాలాజలంతోపాటు ఆ నల్లమందుయొక్క ద్రవము గర్భకోశంలోచేరుతుంది తుదకు రక్తంద్వార మెదడుకు చేరి ఆ మెదడుకు ఒక విధమగు మత్తును కలుగ జేస్తుంది. ఆ మత్తు ఎంతో యానందమని భ్రమించి నిర్భాగ్యపు జీవితం గడపుచున్నారు. మరియు దీనితో తయారైన మర్ఫిన్ యింజక్షన్ను వారిది వారె వేసుకొని అలాంటి మత్తులో యువతి, యువకులు ఆనంద మున్నదని భ్రమిస్తూ తన శక్తిని తనకూ యితరులకు వినియోగించకుండ చేసుకొంటున్నారు. అలాగే కాంపోజ్, డైజిఫామ్, క్లోరోఫామ్ పెథడిన్ మొదలగు యింజక్షన్లను వాడుకొని తనవారికి, తనకు అన్యాయం చేసుకునె వారలు ప్రపంచమున ఎందరో గలరు. యువకులకు స్మగ్లింగ్ దారులు, దేశద్రోహులు వీటిని సప్లైచేసి, సేవించె వారికి యీ మత్తు పదార్ధం ఒక్కొక్కసారి అందుబాటులో లేకుండా జేసి, యేదో ఒక చెడు కార్యము చేసినట్లయితె మీకు యిచ్చెదమని చెప్పుచు వారి పనులు చేయించు కుంటారు. కావున యీలాంటి మత్తు పదార్థంలకు బానిసలు

కాబట్టి ప్రజలు మనోభావాన్ని పుంజుకొనే వంటి వున్నది. ఈ మత్తు సేవించడం ద్వార తన ఆరోగ్యం పాడవడమే కాకుండ తనకు కలిగే సంతతికూడ బలహీనతతో, అంగవైకల్యంతో పుట్టుదురు. కావున ఈ మత్తు పదార్థమును సదా త్యజించడమే మనకు (ప్రజలకు) శ్రేయస్కరము.

పూర్వము ధనవంతులకు, బలవంతులకు (రాజులకు, రాజోద్యోగులకు, వ్యాపారస్థులకు) బహుభార్యత్వం ఉండేది. ఈ బహుభార్యత్వం వల్లగూడ, స్త్రీలతో స్త్రీలు కలహించుకొనుట మరియు పురుషుడు స్త్రీలతో కలహించుట జరుగుచుండేడిది. ఈ బహుభార్యా పురుషులు దేవదాసీలు యనే భోగము వారి దగ్గరికి అప్పుడప్పుడు పోయి వచ్చుచుండేవారు. వారికి ఈ రాజులు కొంత ధనమునిచ్చి, గృహమును నిర్మించి యిచ్చేవారు. వారికి యిచ్ఛజనించినప్పుడు తరచూ వారిని కలసి వచ్చేవారు. ఆ భోగం వారు సంగీత నృత్యములతో ఆ రాజసభ యందు అందరిని మెప్పించి శభాష్ అనిపించుకునేవారు. ఇలా అందరి మన్ననలను పొంది అధిక ధనార్జన చేసేవారు. వారికి పుట్టిన ఆడబిడ్డలను దేవదాసీలుగానే అప్పటి ప్రజానీకం ప్రకటించేవారు. ఎవరైన అందులో పుట్టిన బిడ్డ కులస్త్రీగా జీవించ దలచినచో ఎన్నియో యిక్కట్లకు గురికావలసి వచ్చేడిది. ఈ రాజరికం పోయినను యిలాంటి దురాచారములు ఇంకనుపోలేదు. కొన్ని ఇండ్లల్లో స్త్రీలను దేవుని పేర వుంచడం ఆచార ఆనవాయితి అయినది. వీరిని జోగినులు అని అంటారు. ఈ జోగినులకు ఆ వూరిలోఉండుపోతరాజు అనేవాడు క్షుద్ర దేవత విగ్రహం ముందు వత్తికి బాసింగము కట్టి ఆమె పరిణయము ఆ పత్తితో చేసేవాడు. తాళి ఆ పోతరాజను వాడు కట్టును. (ఈ పోతరాజు చేతిలో ఘెంటలు ఉండును. కాలుకు బేడము వేసుకొనినుదుట పసుపు పూసుకొని ఉండును. ఈ పోతరాజుబాగుగా మత్తును సేవించి, మేకలను, గొర్రెలను గావు పట్టును. అనగా ప్రాణంతో ఉన్న మేకల, గొర్రెల

మనుంసు ఆ మత్తులో కొరికి వేయును. ఇలాంటి జంతుబలులు మన దేశంలోనే కాకుండ యితర దేశాలలో కూడ ఏదో రూపమున జరుగును. జంతుబలులు జరుపవద్దని అడ్డు చెప్పిన యువకులను ఆ వూరి గ్రామ ప్రజలు కొట్టిన దుర్ఘటనలు ఎన్నియో గలవు. జ్ఞానమున్న మనుష్యులు ఈ జంతుబలులను నిరోధించుట మంచిది). అలా పరిణయ మైన స్త్రీతో గ్రామ ప్రజల్లో ఎవరైనను సంభోగించ వచ్చును. ఇలాంటి అసభ్యకరమైన పనులకువారి యింటివారు ప్రోత్సహించేవారు. ఇప్పటికి అక్కడక్కడ రహస్యముగ జరుగుచున్నవని గుసగుసలు వినిపించుచనేయున్నది.

స్త్రీల పట్ల ఎంత అమానుషత్వం. ఇప్పుడిది ప్రభుత్వము కనిపెట్టి కొంత వరకు మాన్పించిందనే చెప్పవచ్చును. వారికి జీవనోపాధి కొరకు కొన్ని గేదెలను, నివాసానికి ఇండ్లను, ఏదో వాకపనిని చేసుకొనుటకు బ్యాంకు వారు ఋణములను మంజూరు చేసినారు. కొన్ని ఉచితంగా కూడ ప్రభుత్వం వారు దానం చేసినారు. తద్వార వీరు అలాంటి భోగం వృత్తిని మానుకొని, వారు కూడ సంఘంలో తోటి స్త్రీలవలె జీవించ ప్రయత్నించు చున్నారు. అయిన అప్పటి అలవాట్లను కొందరు మరువలేక డబ్బుకొరకు రహస్యంగా ఈ వ్యభిచారం చేయుచుండుట ఎంతో విచారకరము. కొందరు ఆ వృత్తి నుంచి బయటపడ ప్రయత్నించినా వారిని ఆ గ్రామములో వున్న పురుషులు ఆ వృత్తిలోకి మరల దించ ప్రయత్నించుట ఎంత అవమాన కరము. ఇంటిలో తన భార్యకు అన్యాయం చేయుచున్నారని ఆ పురుషులు అనుకోరేమో! ఒకవేళ స్త్రీ బయట తిరిగినచో ఆ స్త్రీని దూషించు చుందురు. స్త్రీలతో పాటు పురుషుడు కూడ సమభాగస్థుడై యుండునుకదా. పురుషున్ని దూషించరు. ఇదేమిలోకం. యిదె గ్రుడ్డి న్యాయం అంటారు. ఇలాంటి పనులు చేసే యిద్దరిని దూషించుట మంచిది. ఇలాంటి వ్యభిచారం వలన

సుఖవ్యాధులు ప్రబలి పోవును. గనేరియా, సిఫాలిస్, మహా భయంకరమైన ఏయిడ్స్ వంటి అంటు వ్యాదులు దేశంలో వ్యాప్తి చెందును. ఈ చర్మ వ్యాధులు నరాల బలహీనతను, శ్వాసకోశాల వ్యాధిని కలిగించి అవసాన కాలం వరకు వీరిని పీడించు చుండుట మనము గమనించియే యుందుము. బయట దిరుగు పురుషులు తన భార్యతో కూడు వేళ ఆ పురుషుని బయట సంపర్కము వల్ల వచ్చిన వ్యాదులు యితనితో స్నేహం చేసి నందులకు ఆమెకు కూడ (భార్యకు) ఈ వ్యాధులు వచ్చే అవకాశం ఉన్నది. కావున ఈవ్యభిచార దురాచారమును మనము మనః పూర్వకంగా ఖండించి యితరులకు ముఖ్యంగా యువకులకు దీని వలన మనకు ఎంత నష్టం కలుగు చున్నదో బోధించ వలెను. ఇలా బోధించడం ద్వార మానసికమైన మార్పు కలిగి ప్రజలలో పర స్త్రీని చూడగానె తల్లివోలె భావింపుదురని నా భావన. ఇక స్త్రీని చూసిన పురుషుడు చలించుట సహజం. పురుషున్ని చూసిన స్త్రీ చలించుట సహజము. అది ప్రకృతి ధర్మం. తన భార్యను చూసియే చలించ వలెను గాని యితరులను చూసి చలించినచో సంఘంలో అగౌరవమును మరియు వానికి రోగం కూడ ప్రాప్తించును. స్త్రీలకైనను యిదే నియమము నుంచిది. తన మనస్సును తన అదుపులో పెట్టుకోలేని యువకులైన యువతులైన ప్రపంచానికొక చీడపురుగుల్లాంటి వారు. కావున స్త్రీ, పురుషుల సంయోగము ప్రేమ కార్యంగా నుండవలెను. వ్యభిచరించడ, మహానేరం. ఈ వ్యభిచారం వలన రోజుకు ఎన్నియో పొట్లాటలు జరుగుచు ప్రాణాలు కోల్పోవుచున్నారు. ఇలా కూడ మనదేశైక్యత చెడిపోవుచున్నది. మనదేశములోనే కాకుండ ఇతర దేశములలో కూడ అక్కడి ప్రజల ఐక్యత పాడైపోవుచున్నది.

ప్రకృతి ప్రసాధించిన లింగభేధము ద్వార స్త్రీ, పురుషులు స్త్రీ మూర్తి గర్భకోశములో పెరిగి బయటపడిన సంగతి అందరు యెరింగియే

యుండురు. పురుషాధిక్యత హెచ్చి స్త్రీలను చిన్నచూపు చూపడం ద్వారా స్థానం గల మహిళలు చిన్నబుచ్చుకొనుచున్నారు. అలాగని పురుషులను హింసపెట్టు స్త్రీలు లేకపోలేదు. ఇంతకుముందు కన్యాశుల్కము పేర ఆ కన్య తల్లిదండ్రులు 90 సంవత్సరముల వయస్సు గల వరునకు 10 సంవత్సరముల వయస్సు గల బాలికను కన్యాశుల్కము పేర ఏంతోకొంత ధనమును స్వీకరించి ఆమెకు తాళి కట్టించేవారు. అప్పుడు స్త్రీలు పుట్టినచో తల్లిదండ్రులు మాకు ధనము వచ్చునని సంతోషపడేవారు. ఆ వృద్ధుడు మరణించిన పిదప వాని ఆస్తితో మా బిడ్డ జీవించునని ఆ పిచ్చి తల్లిదండ్రులు భ్రమించేవారు. అలాకాకుంటే ఆ కన్నిక జీవితాంతము కన్యగానే ఉండిపొయ్యేది. కొందరు మహానుభావులు నడుము కట్టి ఆ బాల్య వివాహములను, ఆ కన్యాశుల్కాలను తీవ్రకృషి ద్వారా యించుమించు అరికట్టినారని మనము తెలియందగును. అప్పుడు డబ్బుతీసుకొని పవిత్రమైన స్త్రీ మూర్తిని ఆమె తల్లిదండ్రులు దానం చేసేవారు. ఇప్పటి తల్లిదండ్రులకు స్త్రీ జనియించినదనగానే (ఆడబిడ్డ పుట్టగానే) భయపడుచుండుట తరచు మనము యిండ్లలో గాంచదగును. ఆమెను 18 సంవ సంవత్సరముల దాక ప్రేమతో పెంచి వొక పురుషుని స్నేహముకొరకై యింటింటా తిరిగి మా అమ్మాయిని పెండ్లిచేసుకొనుమని యిప్పుడు కన్న తల్లిదండ్రులకు తీరని వ్యథగా మిగిలిపోయినది.

పెండ్లి చూపుల పేర ఆ యొక్క కన్య ఎందరో వరుల ఎదుట నిలబడి తుదకు విసిగి వేసారిపోయిన సంఘటనలు ఎన్నియో గలవు. పిల్ల అందంగా నున్నను, గుణవంతురాలైనను, విద్యావంతురాలైనను, వరుని యొక్క తల్లిదండ్రులకు ధనమే ప్రధానమైపోయినది. ఎందుకనగా పిల్లవాన్ని మేము కని పెంచి 25 సంవత్సరముల వరకు పోషించి విద్యాబుద్ధులు నేర్పితిమని అనగా నేను ఎన్నియో వినియున్నాను. అలాగ

అయితే స్త్రీమూర్తిని కన్న తల్లి దండ్రులు విద్యాబుద్ధులు నేర్పించి పెంచ లేదా? ప్రకృతి ధర్మానుసారంగా స్త్రీ పురుషులు సమానహక్కు దారులే. ఆ స్త్రీతో ఈ పురుషుడు శారీరక సంబంధం కొరకు వరకట్నమని ఆ కన్య యొక్క తల్లిదండ్రులను హింసించి, నొప్పించి ధనమును కాజేయు చున్నాడు. పెండ్లి అయిన పిదప స్కూటరనియో, ఏదో వస్తువనియో తల్లిదండ్రుల తాహతకు మించిన కోరికలు కోరుచుందురు. తద్వారా ఆ స్త్రీమూర్తి–తల్లిదండ్రులు దుఃఖించిన సంఘటనలు ఎన్నియో మనము కండ్లార చూచుచుందుము. "ఈ పెండ్లి అనే స్త్రీ, పురుషుల స్నేహము, స్త్రీకి యెంత అవసరమో పురుషునికి అంతే అవసరము". వరకట్నము తీసుకొనడం, యివ్వడం రెండునూ అమానుషత్వమే. ఇలాంటి సంఘటనలో అసభ్యకరమైన ప్రవర్తన గల వారిపై మన ప్రభుత్వము చట్టం తీసినది. ఏదేశ ప్రభుత్వము అయినను యేచట్టమైనను తీయవచ్చును గాని ప్రజలలో మార్పు కలిగినప్పుడే అది అమలులోనికి వచ్చునని జగత్తెరిగిన సత్యంబు. ఇలాంటి మార్పుకొరకే మన దేశములోని యువతి, యువకులు నడుం బిగించి దురాచారములను, స్త్రీలకు జరుగుచున్న అన్యాయములను అరికట్ట ప్రయత్నించవలయును.

ఇంకను సతీసహగమనము పేర పురుషుడు మరణించినచో ఆ పురుషునితో స్నేహం చేసిన పాపాన జీవించియున్న స్త్రీ మూర్తులను చితిపై కూర్చుండబెట్టి తగులబెట్టడం యిప్పటికి మనము పేపర్లలో చూచుచున్నాము. అప్పటి నుండి యిప్పటివరకు స్త్రీలను బానిసలుగా భావించి పురుషులు ఆ స్త్రీమూర్తుల యొక్క చనుబాలను గ్రోలి, ఆ స్త్రీమూర్తులతోనే ప్రియాతి ప్రియమైన ప్రేమ కలాపములు జరిపి, ఆ స్త్రీమూర్తినే హింసించుట ఎంత దురాచారము. ఈ దురాచారమును హృదయమున్న పురుషులు ఈ అమానుష ఘాతుకములను, స్త్రీమూర్తులతో

సహకరించి ఖండించవలెను. మతము ముసుగులో పూర్వపు మాటల పేర స్త్రీని హింసించడం సహించరాని నేరం. కొందరు హృదయ పక్వతచెందని పురుషులు, మతాచార్యులు, మూఢనమ్మకములు గల రాజకీయవేత్తలు యిలాంటి చర్యలను ప్రోత్సహించుట ఎంత అవివేకం. హృదయమున్న ప్రజలు సత్యాసత్యములను గ్రహించి యిలాంటి మూఢమతులకు బుద్ధి జెప్పియే తీరవలయును. ఇలా ప్రజలు మారకున్నచో స్త్రీ పురుషులలో బేధము కలిగి వారి ప్రేమానురాగాలకు నష్టం వాటిల్లి ఐక్యత నశించి పోవును. "స్త్రీ మరణించినపుడు మరి పతిసహగమనము ఎందుకుండ గూడదు? ప్రకృతిలో యిద్దరు సమాన హక్కుదారులేకదా! అలాంటప్పుడు ఆ పురుషున్ని చితిలో ఉంచరెందుకు? అవివేకమైన పురుషుల ద్వారా యిలాంటి సాహిత్యము పూర్వము రచింపబడి యుండవచ్చును. అంత మాత్రమున అవి సత్యంబులుగావు. అలాంటి రచనలను మనము తిరస్కరించి సంఘంలో గల మన సోదరీమణులను రక్షించుకొన తీవ్ర ప్రయత్నం చేయవలెను. లేకున్నచో స్త్రీ పురుషులయొక్క భేదం తలెత్తి ప్రపంచంలో ప్రేమయే కరువై పోవును. ఈ ప్రేమ లోపించినపుడు యిక ఐక్యత అనే మాట ఏమున్నది.

ఆనాటి నుండి యీనాటివరకు స్త్రీలోకానికి అన్యాయం జరుగు చున్నదని యెరుంగవలెను. పూర్వీకులు కొందరు స్త్రీలను సహధర్మ చారిణిగా అనగా అన్ని చర్చల సమయమున సమాన హక్కును కలుగ జేసినవారుగలరు. పూర్వీకులు స్త్రీలను హింసించిన వారుకూడ గలరు. కొన్ని మతములలో సతిసహగమనాన్ని ఎలా ప్రోత్సహిస్తారో అలాగే కొన్ని మతములలో 'ఘోష' పేరిట బయటికి వెళ్లినచో ముఖము కనబడ కుండ జేయుచు, యితరులతో మాట్లాడకుండ ప్రపంచ జ్ఞానము పెంపొందించుకోకుండ వారిని అరికట్టుచుండుట మనము చూస్తిన్నదే.

స్త్రీని ఒక బానిసలాగ చూస్తూ ఇల్లు అనే జైలులో వుంచి బయటి ప్రపంచానికి దూరం చేయుచు మేము స్త్రీలను ఎంతో ప్రేమిస్తున్నామని నుడువుతారు. స్త్రీలపై యిలాంటి అత్యాచారములను ఖండించవలెను. ఎవరైన ఖండించదలచినచో ఆ మతములోని స్త్రీలు. పురుషులు మా మతం యిలాంటిదని బోధించుచుందురు. కొందరు స్త్రీలకు ఈ ప్రపంచ జ్ఞానం కలుగజేసుకోవాలని ఉన్నా పురుషులు వారి స్వేచ్ఛను అరికట్టి జూచు చున్నారు. యిలాంటి పురుషాధిక్యత, స్త్రీలపై అత్యాచారము, అమానుషత్వం ఎప్పుడు నశిస్తుందో అని ఎదిరిచూద్దాం. కొందరు స్త్రీలు పురుషులను హింసించిన వారుకూడ కలరు. అయిన స్త్రీపురుషులు ప్రకృతి పరంగా సమానులే. ఒకరిపైన ఒకరి అధికారముగాక ప్రేమానురాగాలను పెంచుకొని ఒకరి నొకరు అర్థము చేసుకొనిననాడు ఈ గొడవలు సమసి పోవును.

ఆది కాలమందు పరిణయంబన్నది యించుమించు లేకపోవచ్చును. నాగరికత పెరిగినకొలది ఈ పెండ్లియన్నది పవిత్ర కార్యమని యప్పటి ప్రజలలో భావించారు రాను రాను బహుభార్యాత్వము, బహుపతిత్వము రెండును నేరములే యని వారి దృష్టికి వచ్చినది. ఇప్పటికి ప్రపంచములో కొన్ని దేశాలలో బహుభార్యాత్వము, నాగరికత యని వారి అభిప్రాయము. కాని యిప్పటి కాలమునకు వొక భార్యకు వొక భర్త ఉండడమే శ్రేయస్కరము. ఎందుకనగా కుటుంబ పోషణలో మరియు వారి వారి కోరికలను తీర్చుకోలేని స్థితిలో ఉందురు. ఎలాగైననేమి బహుభార్యాత్వము, బహుపతిత్వం యిప్పటి నాగరికులకు తగదు. ఈ పెండ్లియన్నది పూర్వ కాలమందు ఎలా ఉన్నా యిప్పుడు గుడిలో పెండ్లి హిందువుల బ్రహ్మణుడు జరుపును, చర్చిలో ఫాదర్ సమక్షంలో క్రైస్తవుల పెండ్లి జరుపుట, ఖాజా వచ్చి జరుపుట (ముస్లిం మతము వారిలో), యిలాగ

బౌద్ధ పెళ్ళిలు కూడ గలవు. అలాగే ఇప్పటి కాలములో రిజిస్టర్ మ్యారేజి కూడ గలదు. పుస్తె కట్టుకున్నను, ఉంగరం పెట్టుకొన్నను, దండలు మార్చుకొన్నను, శిఖా కాలమున నల్లపూసలు దండ మార్చు కొన్నను, ఇవి యన్నియు పెండ్లిళ్లేయని ప్రజలు వారు ఏర్పరచుకొన్న సంఘములలో నిర్ణయించుకొన్నారు. ఇక్కడ మనము ఆలోచించవలసినది ఏమనగా ఏ పెండ్లికైనను కొద్దో గొప్పనో తోటి మానవులను పిలవడము ఆచారము గలదు. ఎందుకనగా యిప్పటి నుంచి పరిణయంబాడె కన్నె మరియు పరిణయంబాడె పురుషుడు నలుగురి ముందు పెండ్లి అయినది యని, మా అందరి సమక్షంలో వీరిరువురు భార్యాభర్తలైరని, ప్రపంచ కార్యము చేయవచ్చునని, అందరికి తెలియుట కొరకై యిలాంటి ఆచారములు యిప్పటికి జరుగుచున్నవి. మరియు ఒకరంటె వొకరు యిష్టపడి యేదండలు మార్చుకొనకుండా, యే ఉంగరములు మార్చు కొనకుండా యేశిఖా వేసుకోకుండా తిరుగవచ్చు గదా యని కొందరు వాదించుచుందురు. ఈ ప్రేమికులు మాత్రము మనస్సులు కలిస్తె చాలని అంటారు. అయినా సంఘంలో మేము భార్యాభర్తలమని చెప్పుకోక తప్పదు. స్త్రీలకు అలంకారములో యించుమించు అంతా ఒకే విధంగా ఉన్నా, కొందరు బొట్టు పెట్టుకోవడం, కొందరు బొట్టుపెట్టుకొనక పోవడం. కొందరు పూలు పెట్టుకోవడం, కొందరు పూలు పెట్టుకొనక పోవడం, వీటిపై కూడ యిప్పటికి వారి వారి పిచ్చి మూఢనమ్మకములు గలవు. బొట్టుపెట్టుకొన్నచో స్త్రీ అందముగా కనిపించునని, పసుపు పూసుకున్నచో అది క్రిమి సంహారిణి అని (Antibitic) వొప్పుకొన్నారు. అందువల్ల మనము నిత్యం వాడేశాఖంలో (కూరలలో) ఆరోగ్యం కొరకు పసుపును వేసుకొనె అలవాటుగలదు.

ఇక పురుషులలో వారి వారి ప్రదేశాన్ననుసరించి వారు వేసుకునే బట్టలలో తేడా ఉండును, పురుషులు మర్మాంగము పైపొరను

కోసివేయుట (సున్నత్) వొక ఆచారము గలదు. బహుభార్యాత్వము గలవానికి వారి వారి శరీరంబు పడక యెన్నియో అంటు వ్యాధులు రావచ్చును. ఆ అంటు వ్యాధుల భయమునకు ఈ పైపొరను తీయు విధానము ఆచారములోనికి వచ్చియుండ వచ్చును. ఇంచుమించు 1400 సంవత్సరాల క్రితం నుంచి ఈ యాచారము పలుకుబడిగల వ్యక్తుల వల్ల వచ్చియున్నదని తెలియుచున్నది. ఈ సున్నత్ అనునది మా ఆచారమని అది వారి దైవభక్తి యని చెప్పుచుందురు. ఇలాంటి మూఢాచారములకు దేవుడికి ఎలాంటి సంబంధము లేదు. ఒకవేళ ఆదేవుడే వీరికి మర్మాంగము పైపొరను తీసివేయాలని అనుకున్నచో జనని గర్భములోనే అలాంటి మార్పులు ప్రకృతి ద్వార వారి అల్లాతాలా చేసి ఉంచే వాడుగదా యని వాదించుచుందురు. ఇలాంటి మానవులు కల్పించుకొన్న ఎన్నో ఆచారాల ద్వార వారి వారి ప్రాంతాలననుసరించి ద్వారా మతమును ఏర్పరచుకొని, మానవులను మానవునే హింసించుకొనే వరకు దిగజారిపోయినారు. ఇలాంటి ఆచారములను విచారం చేసి ప్రతి మానవుడు మూఢత్వము విడచి మానవున్ని మానవుడు ప్రేమించకున్నచో యెప్పటికైనను ఈ మూర్ఖపు మతాలోచన ద్వార మనమంతా బాధపడవలసి తప్పదు. ఈ యచారములన్ని అప్పటి ప్రజలకు సమ్మతం అయినా ఇప్పటి ప్రజానీకానికి వారి సమ్మతములు, ఆచారవ్యవహారముల మారణహోమంగా పరిగణించినవి. కాబట్టి యిప్పటి ప్రజానీకానికి పనికిరావేమో!

కోటి మతములైనను, శతకోటి ఆచారములైనను, మానవున్ని మానవుడు హింసించినాడు, ప్రేమ నశించిననాడు ఇవి యన్నియు వ్యర్థములే. పవిత్రమైన ప్రేమ పదికోట్ల మతములు, చెప్పలేనన్ని కోట్ల క్షీరనుకునే దేవుళ్లమూఢాచారములకు అతీతము.

ఇంకను యిదియే కాకుండ ప్రపంచములో జూదమనే వ్యసనము పొరుకొని పోయినది. పేకముక్కలతో, నంబర్ల చక్కీతో, మట్కా (పాన) పేరిట ప్రజలు ఎంతో డబ్బును పోగొట్టుకొని రాత్రి రొండుగంట వరకు మేలుకొని యుండుట మనము గాంచినారము. మరియు గుఱ్ఱపు పందెములు, లాటరీ టికట్లు యింక ఎన్నియో జూదవ్యసనములు గలవని చెప్పవచ్చును. కొందరు క్యారంబోడ్ పైన, చెస్ ఆటలపైన కూడ డబ్బులు పెట్టి ఆడగలరు. ఇలా ఆడడం ద్వార సమయం వృధాకావడమేగాక వారి వారి భార్యల పుస్తెలు (తాళి) అమ్మిన దృశ్యాలు ఎన్నియో గలవు. ఈ పేక ముక్కలు ఆడు చుండగ యింటిలో భార్యకు జ్వరం వచ్చినా "తర్వాత వస్తానులే" యనే వారిని నేను చూసినాను. కుటుంబ విషయంలో పట్టించుకోక ఎప్పుడూ తిరుగుతూ జూదం ఆడువారుగలరు.

ఇలాంటి జూదమాడువారి కుటుంబంలో ప్రేమాభిమానం కరువై కుటుంబ కలహాలు జరుగుచుండును. కావున జూద వ్యసనము మహా చెడ్డది. అలాగె లాటరీ టికట్లను కొనడానికి యింట్లో ఉన్న ఆస్తినంతయు తగులబెడ్తారు. జూదంవల్ల ఆర్థికంగా కుటుంబపోషన భారమై అప్పుల బాధలు అధికమై ఆత్మహత్య చేసుకున్న సంఘటనలు ఎన్నియోగలవు. ఈ వ్యసనం వల్లకూడ ప్రజలలో ప్రజలకు ఐకమత్యము నశించుచున్నది. కావున జూదం, మట్కా, గుర్రం పందెములు ఆడువారు యికనైన మాని సక్రమమార్గంలో నడచి, కష్టించి పనిచేసి సులభంగా జీవనాన్ని గడప గలరని నా భావన. ఈ వ్యసనము ఎలాంటిదో పొగత్రాగడం కూడ అలాంటిదే. ఈ పొగత్రాగడం ఆరోగ్యానికి హానికరం అని తెలిసినా ప్రజల్లో ఈ దురలవాటు ఎక్కువగా చోటుచేసుకున్నది. ఈ పొగ త్రాగడం ద్వారా "నికోటిన్" అనే విషపదార్థం వారి ఊపిరితిత్తులలోజేరి క్షయ, ఉబ్బసం, క్యాన్సర్ లాంటి వ్యాధులు ప్రబలి వారి మరణం వరకు దారి

తీయును. అలాగే జర్దతోకూడిన ఆకు తినడం వల్ల యిలాంటి వ్యాధులు వస్తాయి. మొట్టమొదట ఈ పొగత్రాగడం గాని, ఆకుతినడం గాని అలవరచుకొనే యువతీ యువకులు సరదాకొరకు మొదలిడి తుదకు దానికి బానిసలౌతారు. ఆ అలవాటే పొరపాటుగా వారిని విడవకుండ వ్యసనపరులుగా చేయుచుండును. దీని ద్వారా ధనవ్యయం అటుంచి "ఆరోగ్యమే మహాభాగ్యం" అను సూక్తిని దూరం చేసుకొను చున్నారు. తుదకు శరీరం చెడిపోయి త్వరగా మృతినొందు చున్నారు. కావున యువకులు, యువతులు వీటిని ఆశ్రయించనివారు దాని జోలికిపోకుండుట ఎంతో శ్రేయస్కరము. ఆశ్రయించిన వారు త్యజించవలెను. పురుషులు, స్త్రీలు సిగరెట్టు, ఆకు తినేవారిని చూసి ఆ వ్యసనం లేనివారు అసహించుకొనడం ద్వారా మనుష్యుల్లో, మనుష్యులకు జగడములు జరిగి ఐక్యభావన నశిస్తుంది. ఈ ఐక్యభావన కొరకైన ఈ వ్యసనాలను మానుకొనగలరు.

మనకు స్వతంత్రము తెచ్చిన స్వతంత్ర యోధుల పేరిట, నాయకుల పేరిట పార్టీలను స్థాపితమొనర్చి యిప్పటి స్వార్థపరులు కొందరు వారిపేరిట వోట్లను సంపాదించుకొని సీట్లపై ఎక్కుచున్నారు. అలా రాజకీయ నాయకుల అభిమానులు ఒకరిపైనొకరు కలహించుకునేటట్లు చేయుచున్నారు. ఇలా చేయడంద్వార దేశం ఐక్యత నశించుచున్నది. ఇంకను సినిమా నటులపై అభిమానం ఈనాటి యువకులు పెంచుకొని అభిమాన సంఘాలు ఏర్పరచుకొని ధనమును వ్యయ పరచుచున్నారు. ఒక నటుడి అభిమాని యింకొక నటుడి అభిమాని ద్వేషపూరితులై కొట్టుకొను చుండుట ద్వార ఆ నటుల అభిమానులు నటులపేరిట తన్నుకొనుట నేను గాంచితిని. ఆ నటుల అభిమానులు వారి యింటివారిని కొట్టిన సహింతురు గాని వారి అభిమాన నటులను తిట్టిన సయ్యము దిగుట మనము

యెరింగియే యుందుము, ఇలా కూడ మన దేశ ఐక్యత కొంతవరకు పాడైపోవు చున్నది. ఏదైన చిత్రమును కళాత్మక దృష్టితో చూడ వలెను. అశ్లీలతగల, అసభ్యకరముగల చిత్రములు, హత్యను ప్రోత్స హించేలాగ, దొంగతనమును ప్రోత్సహించే చిత్రములను, ప్రజల హృదయములను ఉద్రేకపరచే చిత్రములను ప్రజలు నిరాకరించవలెను. ఇలాంటి సినిమాలను తీసే ఆ నిర్మాతలు ప్రజల బలహీనతతో సొమ్ము చేసుకొని కులుకు చున్నారు. కళాత్మక చిత్రములు, మనస్సుకు ఆనంద మును కలుగజేయు చిత్రములు జూడడం ద్వార మానసిక ఆరోగ్యము కలుగును. అసభ్యకరమైన, ఉద్రేక పరచే చిత్రాలను చూడడం ద్వార మానసిక ఆందోళన కలిగి మనస్సులో అలాంటి ముద్రలు పడి యిప్పటి యువకులు, యువతులు, బాలలు చెడిపోవుటకు అవకాశమున్నది. ఈ సినిమాలు చూడడంద్వార నరాల బలహీనత ఏర్పడి ఉద్రేకపడు చుండుట మనము గమనించియే యుందుము.

"నవ్వు ఒక టానిక్ లాంటిదని" ఒక సామెత. హాస్య చిత్రాలు చూడడం ద్వార మనోల్లాసము కలుగును. మనోల్లాసం ద్వార మనకు కొంత ప్రశాంతత లభించును. కావున ఏ మాత్రం అసభ్యకరంలేని కళాత్మక చిత్రాలను, నీతిని బోధించే చిత్రాలను చూడటం ద్వార ప్రజలు మానసిక ఆందోళనకు గురికాకుండ ఉందురు. కావున మంచి చిత్రాలను చూడవలెను. చిత్రాల వెంటబడి డబ్బును వ్యర్థపరచి ఆర్థిక యిబ్బందులకు గురి కాకుండ ఉండడమే మంచిది.

ప్రపంచ దేశాలలో వివిధరకాల (క్రికెట్, ఫుట్‌బాల్, వాలీబాల్) క్రీడలు గలవు. ఈ క్రీడలు వివిధదేశాలకు పోటీలు జరుపుచుందురు. అభిమానులు మా ఆటగాడు గొప్ప అంటే మా ఆటగాడు గొప్పనియు,

మా దేశము ఆటగాళ్ళు బాగుగా ఆడతారని ప్రపంచంలోని వివిధ దేశాల అభిమానులు తరచూ పొట్లాడుకొంటారు. ఇలా క్రీడాకారుల అభిమానులు, వారి దేశ క్రీడాకారుల పైనున్న మోజుతో ప్రపంచ దేశ ప్రజలలో ఐక్యత లోపించుచున్నది. ఏ ఆటయైనను, ఏ కళయైనను ఆనందమును కలుగజేయునటుల ఉండవలెనుగాని వాటి వల్ల పోట్లాటలు జరుగునటుల నడుచుకోకూడదు. పై అభిమానులు వారి వారి అభిమానుల ఫోటోలకు పూలమాలలలంకరించడం సినిమాథియేటర్లలో అభిమాన ప్రకటనలివ్వడం, తరచువారి అభిమాన సంఘములలో విందు చేసుకోనడము ఒక్కొకసారి తన్నుకోవడము కూడ జరుగుచుండును. కనిపెంచిన తల్లి దండ్రులకు ఒక్కసారైన నమస్కరించ మనసొప్పని ఈ అభిమానులకు బుద్ధివచ్చెదెన్నడో? వారి మాతాపితరుల సేవ చేసేదెన్నడో? ఇందులో కూడ బుద్ధివున్న వాళ్లు యుండవచ్చునుగాని ఈ అభిమానము పేరిట పొట్లాట పెట్టుకొని తల్లిదండ్రులకు అన్యాయము చేయకుడని మనవి.

ఇప్పటి కాలమున ప్రతి ఒక్కరు నీడ పట్టనే ఉండవలెనని, ఆ నీడ పట్టుకు పని చేసుకొన వలెనని ఆశిస్తుంటారు విద్యార్థులు, విద్యార్థినులు యువకులై డిగ్రీలు చేతబూని పుద్యోగాలకై తిరుగుచుండుట మనము జూసియే యుందుము. ఇంటి వద్ద ఎకరాలకు ఎకరాలు భూమిఉన్నా, దాన్ని సాగుచేసుకొని జీవించడమనే ఆలోచనేరాదు. ఎందుకనగా ప్రభుత్వ ఉద్యోగం చేసినచో ప్రతి నెలకు మొదటి తేది రాగానె జీతం డబ్బులు పొందవచ్చునని, ఈ వ్యవసాయం చేసినచో అధిక కష్టము అగునని దానిలో లాభం లేదని తలుస్తారు. ఇప్పటికే చాలా మంది వ్యవసాయదారులకు భూమి ఉన్నను, భూమి దున్నినది మొదలు పంట చేతికి వచ్చేవరకు నీరు, క్రిమిసంహారక మందులు, పొటాష్, యూరియా మొదలగు మొక్కలకు బలము నిచ్చే ఎరువులు కొనడానికి డబ్బులులేక యువస్థపడు కర్షకులను నేనెందరినో గాంచితిని. అలాంటి కర్షకులకు బ్యాంకులు కొంత డబ్బును

ఋణంగా యిచ్చినను, ఆ ఋణభారంవల్ల గృహములో వుండిన తన భార్య పిల్లలు బ్రతకడం ఆ వ్యవసాయముపైన కష్టమైపోయినదని భావించు చుందురు వాస్తవంగా ప్రభుత్వ ఉద్యోగులకు నెలసరి జీతం వచ్చిన డబ్బు ఒక కర్షకుని కుటుంబము సంవత్సరము పొడవునా కష్టించినను అంత ఆదాయం రాదు. అందుకొరకె వ్యవసాయదారులు కూడ బంట్రోతు (ప్యూన్) ఉద్యోగానికయిన సిద్దపడి ప్రభుత్వ ఉద్యోగమునకై ప్రాకులాడుట మనము గమనించదగ్గ విషయము. ప్రపంచములో అందరికి సంఘాలు ఎన్నియోగలవు. కాని కర్షకులకు మాత్రం సంఘములులేవు. ఒక వేళ ఉన్నా యీ కర్షకులు వొక్కచోట చేరడం మహాదుర్లభం. ఎందుకనగా "రెక్కాడనిదే డొక్కాడదు" అనే సామెత వీరికి చెల్లును. వీరికి మన ప్రభుత్వం ఎంతయో చేయూత నిచ్చినా నిరాష, నిస్పృహ బయలు దేరు చుండుట మనము గమనించదగ్గ విషయము. కావున రైతునకు సాలీన సరిపోయె, వాని నిత్యావసర వస్తువులకు సరిపోయె మూల్యము గిట్టుబాటు అయినచో ఈ ప్రపంచమంత సుఖంగా నుండును. ప్రతి మానవుడు అన్నమో, రొట్టెనో లేక పండ్లో, పాలో తీసుకొనుట సహజము. కాని బంగారమును మ్రింగలేడు కదా. జ్ఞానులైన మేధావులు, రాజకీయ వేత్తలు మరియు ప్రపంచములో గల మానవులందరు యిది యోచించగలరు. కర్షకులకు చేయూత నివ్వకున్నచో వ్యవసాయరంగం కుంటుబడును. అలా కుంటు బడ్డనాడు మనము ఎన్ని ఫ్యాక్టరీలు నిర్మించుకున్న, దేశంలో ఎన్ని మార్పులు తెచ్చిన ఆహారం కరువై పోవును. తద్వార యితర దేశములపై ఆధారపడవలసి యుండును. ఇతర దేశములపై ఆధారపడుట ఎంత సిగ్గుచేటు. ప్రపంచానికి మూలాధారమగు యీ వ్యవసాయ వృత్తి మనందరికి తల్లి వృత్తిలాంటిది. కావున తల్లిలాంటి కర్షకులను మనము దయాగుణముచే ఆదుకొనవలసి వున్నది. అనగా మన ప్రభుత్వం ఆలోచించి వీరికి ఋణకను న్యాయం చేయవలసి వున్నది.

ఇక మిగిలిన వృత్తుల వారి సంగతి. శరీరంలో ఏభాగము లోపించినను అంగవికారం యే విధంగా కనిపించునో అన్ని వృత్తులు ప్రపంచంలో శ్రేష్ఠమైనవే. వారి వారి వృత్తికి న్యాయం చేకూర్చిన నాడు ఆ వృత్తి మహోన్నత శిఖరాలను అధిరోహించును. కావున ఒక వృత్తి చిన్నదనిగాని, ఒక వృత్తి పెద్దదని గాని నా యభిప్రాయము గాదు. అన్ని వృత్తులు అవసరమే కాని తినేఆహారం లేకపోతె మన మనుగడ లేదు. అన్ని వృత్తులు ఆహారము కొరకు పాటుపడునని గమనించ దగును. ఇలా చదువుకున్న యువతీ యువకులకు నిస్పృహ వారిలో బయలుదేరి వుద్యోగాల వేటలో అలసిపోయి తుదకు కొందరు వృద్ధులైనవారు కూడగలరు.

మన ప్రభుత్వంవారు యిప్పటికే కళాశాలలో వృత్తి విద్యలను ప్రవేశపెట్టిరి. ఆ వృత్తి విద్యను కళాశాలల నుండి బయటకు వెడలిన తర్వాత తాను స్వయంగా పని చేసుకోవడానికి బ్యాంకులు కూడ కొంత ధన సహాయం చేయుచున్నవి. దానిని వినియోగించుకొనుటకు చాలామంది యువకులు యిష్టపడరు. ఎందుకనగా శ్రమతో కూడుకున్న పనని, ప్రభుత్వ ఉద్యోగం అయితే నెలనెలకు డబ్బు పొందవచ్చునని భ్రమ జెందుతారు. ఇలాకూడ మనలో మనకు ఐక్యత లోపించుచున్నదనే తెలియ వలెను. ప్రభుత్వము మాత్రము ఎంతమందికని ఉద్యోగం కల్పింపగలదు. ప్రభుత్వమనగా ప్రజలచే ఎన్నుకోబడ్డ రాజకీయవేత్తలు మరియు ప్రజల నుండి వసూలుచేసిన నిధిని సక్రమంగా నిర్వర్తించువారు. ఆ నిధి ద్వారా ఎంతమందికని ఉద్యోగాలు కల్పించగలరో మీరే ఆలోచించండి. దీనికి మూలం సాలీన కొన్ని కోట్ల జనాభా పెచ్చుడమే. ఈ జనాభా పెచ్చుడం ద్వారా ప్రజలకు ఉద్యోగావకాశాలు లేక ఎదుటివాని బాగోగులు చూసి బాధపడుచుండుట మనము గమనించదగ్గ విషయము. ఇలాకూడా మన దేశ ఐక్యత పాడవుచున్నదని నేను దృఢంగా నమ్ముచున్నాను. ప్రభుత్వం

కుటుంబ నియంత్రణ కొరకు ఎంతయో నిధిని ఖర్చు చేయుచున్నా, అక్కడక్కడ యింక పాడు విశ్వాసాలు వీడలేని భ్రష్టులు గలరు. పిల్లలను ఎక్కువగని వారిని నికృష్టపు జీవితం గడుపుమని శపించుచున్నారు. ఏలయన తగిన ఆహారం, తగిన వస్త్రము, పెరిగిన పిదప తగిన వృత్తి లభించక దొంగలుగా మారే అవకాశమున్నది. ఒక్క దొంగతనం ఏమిటి స్మగ్లింగ్ చేయు షురాన దొంగలకు వీరు సహాయ దొంగలుగ (Assisten) పనిచేయుచున్నారు. కొందరు మతోన్మాదులు కుటుంబ నియంత్రణ మా మతంలో విరుద్ధమని, వారి మతంలో కుటుంబనియంత్రణ పాటించకుండ ఉండవచ్చునని యిలా ఏటేటా పిల్లలను కనుచున్నారు. ఇలా కనడం ద్వారా ప్రపంచ దేశములన్నియు ఆ దేశ జనాభాను చూసి భయపడవలసి వచ్చును. ఈ జనాభా అధికమగుటచే ఒకరిదొకరు లాగుకొనవలెననే, (ఉపయోగించుకొనవలెనని) బుద్ధులు తప్పకుండ కలుగును. ఇలా కలిగిన నాడు ప్రపంచ దేశాలన్నియు కలహించుకొనుట తథ్యం. కావున యిప్పటినుండే జనులెల్లరు జనాభాను (సంతానమును) అదుపులో పెట్టుకున్నచో ప్రపంచమంత సుభిక్షంగా ఉండును.

ప్రభుత్వమనగా ప్రజలచే ఎన్నుకొనబడ్డ వ్యక్తులు. ఆ ఎన్నుకొన్న వ్యక్తులను న్యాయం చేకూర్చగలరనే నమ్మకముతో వారి వోటును ప్రజలు వినియోగించుకొందురు. ఈ వోటును వినియోగించుకునే వారు డబ్బులకో, మత్తు పదార్థములకో, చెప్పుడు మాటలకో నమ్మి మోసపోవుట కూడా గలదు. మనుష్యులు నిలబడ్డ ఆ రాజకీయవేత్తల గుణగణములను గ్రహించి వోటు వేయడం ద్వారా వారు మనకు న్యాయం చేకూర్చగలరు. కాని కొందరు గెలిచిన పిదప ఆ వ్యక్తిలోపల గర్వము చోటుచేసుకొనును. ఆ గర్వము చోటుచేసుకొన్న పిదప ప్రజలకు న్యాయం చేకూర్చకుండును. ఒక వ్యక్తి గుణములు తెలుసుకొనుట సామాన్యంగా కష్టమే. అయినా

ప్రజలు నిగర్విని ఎన్నుకొనుట మంచిది. ఈ రాజకీయవేత్తలు వారి స్వార్థమునకై పార్టీల పేర, రాజకీయము పేర ప్రజలను పీల్చివేయుచుండుట యిప్పటికే మీరు గ్రహించియుందురు.

ప్రజలు లంచము, లంచమని, లంచగొండి తనము ఎత్తి పొడుచుట మనము చూచియేయుందుము. ఈ లంచగొండితనం ఎవరు ఎవరికి నేర్పిరో గ్రహించగలరు. ఎవరు తీసుకొనుచున్నారు? ఎవరు యిచ్చుచున్నారు? లంచం తీసుకొనే వ్యక్తి ప్రభుత్వోద్యోగి. అనగా ప్రజల నిధినుండి జీతం తీసుకుని ప్రజలకు ఆయా శాఖలయందు న్యాయం చేకూర్చు ఉద్యోగి. ఆ ఉద్యోగులు కూడా ఆయా దేశముల యొక్క మనుష్యులే. ఇచ్చువారుకూడా ఆ దేశీయులే. లంచం యిచ్చువానికి, లంచం పుచ్చుకొనువానికి హృదయంలో మార్పు కలిగిననాడు వాస్తవముగ యీ లంచగొండితనం మాసిపోవును.

డబ్బు లంచంగా యిచ్చువారు, లేక వస్తురూపంగా యిచ్చువారు, వారి పని సులభంగా త్వరగా జరగాలని యితరుల కంటెముందు పని చేయించుకొనవలెనని లంచం యిచ్చుచుందురు. ఇది మహాపాపము లేక, అన్యాయమని, ఇచ్చువానికి, పుచ్చుకొనువానికి యిద్దరికి తెలియును. లంచం యిచ్చువారి పనిని గ్రహించి పుచ్చుకొనువారు ప్రభుత్వ జీతమేకాక యీ లంచముతో ఇంకా సుఖమైన జీవితం గడుపవచ్చునని, డబ్బుకై ప్రలోభపడతారు. ఇలాంటి లంచగొండితనంను రాజకీయ వేత్తలు అందరు కలిసి ఒక రాజ్యాంగ చట్టమును అంతటను రూపొందించి అమలు పరుస్తున్నారు. ఈ లంచగొండితనంను రహస్యంగా తెలుసుకొని ఆఫీసర్లే, అధికారులు కూడకొందరు ఆ ఉద్యోగులనుండి లంచంతీసుకొని మారిపోవు అప్పుడప్పుడు మనము చదివియే యుందుము. ఇందులో వాస్తవంగా ఈ తప్పు ఎవరిదని గ్రహించినచో అది మనము ఎన్నుకొన్న ప్రభుత్వ

ఉద్యోగుల చట్టంను తీసిన ప్రజలవి. అది ప్రజలు సక్రమంగా వినియోగించుకొనినచో ఎన్ని చట్టములు తీసినను లాభముండదు. ఇలా లంచం యిచ్చువారు బయటికి వచ్చి అయ్యో లంచం తీసుకున్నాడని వాపోవుచుందురు. తన పని త్వరగా చేసుకొనవలెననే దురాశతో ఈ పనికి పూనుదురు. ముందు యెవరైతే లంచంయిస్తారో వారికి ప్రథమంగా శిక్ష విధించవలెను. ఎన్నిశిక్షలుఉన్నా, ఎన్ని చట్టములు తీసినా వాస్తవంగా ప్రజల్లో మార్పురావడమే ముఖ్యం. కొందరు లంచం తీసుకొనని వారు కూడ ప్రతి శాఖలలో గలరు. వారిని లంచం తీసుకునేవారు అపహాస్యం చేయుటకూడగలదు. వారు అట్టివారి మూర్ఖపు మాటలను లెక్కచేయని ధీమంతులు యింకా గుండె నిబ్బరముతో సక్రమమైన ఉద్యోగాన్ని నిర్వర్తించ గలరని ఆశిస్తున్నాను. అవినీతి యనేది తన ఆలోచన ధోరణియని తెలుసుకొని అలాంటి అవినీతికి చోటు చేసుకొనే అవినీతి ఆలోచనలను తనలోతాను తర్కించి విడవవలెను.

భారతదేశమున ద్రవిడులమని ఆర్యులమని అప్పుడప్పుడు మట్లాడు చుండుట మనము చూచియేయుందుము. ఉత్తరభారతీయులు ఆర్యులనీ, దక్షిణభారతీయులు ద్రావిడులనీ బేధభావము వలన సమాజములు యేర్పరుచు కొనడము ద్వార ప్రజలలో భిన్నాభిప్రాయములు యేర్పడుచున్నవి.

ఇతరదేశాలలో మరియు భారతదేశమున కూడ ఎన్నియో సమాజంలను స్థాపితంచేసి ఎందరో ధీమంతులు ప్రజలను మేల్కొలిపినారు. అందులో కొన్ని సమాజములు ఒక మత ధ్యేయమునకు కట్టుబడి పోవడంద్వార యిప్పటికి వారి సమాజములు మత సంస్కరణలపేర సేవ జేయుచున్నవి. ఇలామత ప్రచారపరంగా సమాజములు ఏర్పడడం ద్వార ప్రజలలో మత పరంగా విభజనజరిగి ఐక్యతలోపించింది,

ఈ మతాల మత్తులోబడి ప్రజల్లో అల్లకల్లోలం చెలరేగి ఆయుధాలతో ప్రాణాలు తీసుకొనేవరకు వచ్చింది. పూర్వకాలమందు అనాగరికులు ఆహార సంపాదనకై ఏదో ఒక ఆయుధమును తయారుచేసుకొనిరి. ఆ ఆయుధమును యితర జంతువుల బారినుండి రక్షించుకొనుటకు ఉపయోగించు కునేవారు. అప్పటి కాలంలో ఒక గుంపు నిధిని మరొక గుంపువారు దౌర్జన్యంచే కొల్లగొట్టడంద్వార, కొట్లాటలు జరిగినప్పుడు ఆయుధాలను వాడేవారు. తర్వాత కొద్దికొద్దిగా నాగరికత పెరిగినకొలది మల్లయుద్ధం, కత్తియుద్ధం, విల్లుయుద్ధం (బాణాలు) ఇలా ఎన్నియో యుద్ధములు ప్రజల్లో జరిగినవి. కడకు తుపాకులు, బాంబులు ఇతర మారణాయుధాలు కూడ వెలిసినవి. మనుష్యులు రాను రాను అడవులను నరకుచు, సేద్యం చేయుచూ, యిండ్లను నిర్మించుకొనుచున్నారు. మన పరిజ్ఞానం తుపాకులు, తోపులు, చేతిబాంబులు, హైడ్రోబాంబులు చివరికి అణుబాంబుల ప్రయోగాల వరకు వచ్చినవి. ఈ ప్రయోగాలద్వార మానవులచే నిర్మింపబడ్డ ఆయుధం మానవులను సమూలంగా నిర్మూలము గావించుటకు సిద్ధంగా నున్నది. అప్పటికాలంలో మానవులకు క్రూర జంతువులే శత్రువులైతే యిప్పుడు మానవులకు మానవుడే శత్రువు. ఆ భయంచేతనే మానవుడు ఆయుధమును చేబూనవచ్చినది. ఇలాపోతూవుంటే మానవజాతిని, యావత్ ప్రపంచాన్ని ధ్వంసంచేయు అణుబాంబులను కూడ ప్రయోగించ వచ్చు. ప్రజలందరు శాంతి భావాన్ని అలవరచుకొన్నచో ఈ ప్రమాదం ఆగుతుంది. మనము దీనికొరకు శాంతి స్వరాజ్యాన్ని స్థాపించాలి. మనము మారుచున్నచో మనభావాలు పిల్లలకు వస్తాయి. పిల్లలను పెంచేపద్ధతికూడ మనము జాగ్రత్తగా చూచుకోవాలి.

ఇప్పుడు ప్రపంచమునందు జరుగుచున్న కుళ్ళు, అమానుషత్వం రాబోయేతరం వారికి అంటకుండా ఉండాలంటే పిల్లలు సహృదయంతో సత్ప్రవర్తనతో మెలగాలంటే కారణం వారి తల్లిదండ్రులు మరియు

పరిసర ప్రభావం. ఇంట్లో ఉన్న తల్లిదండ్రులు, యింటి పెద్దలనడక, వారి మాటతీరు యిత్యాదులు ఆ పసిపాపల హృదయాలలో చోటు చేసుకొంటాయి. మనము ఇంటిలో ఏమాటలు పలుకుచుందుమో అవే మాటలు యితరులతో పిల్లలు మాట్లాడుచుండుట మనము నిత్యజీవితంలో ఎరింగియే యుందుము. కాబట్టి ప్రత్యక్షంగా తల్లిదండ్రులే బాధ్యులు. ఇక పెరిగిన కొలది స్నేహితుల వాతావరణం, వారు నివసించే గృహము చుట్టూవుండే పరిసర గృహస్థుల ప్రవర్తనల ద్వార పిల్లలలో అలాంటి భావాలు ఏర్పడటానికి అవకాశం వున్నది. కావున పిల్లల్ని కన్న తల్లిదండ్రులు పిల్లల యెడ బాధ్యతా రహితంగా ప్రవర్తించ కూడదు. వారి ముందర అశ్లీలత, అసభ్యకరమైన, నీతిమాలిన పనులు చేయకూడదు. లక్షణంగా తల్లిదండ్రులు ప్రవర్తించడం ద్వార సులక్షణంగా పిల్లలు ఎదగటానికి అవకాశం ఉన్నది. అన్నింటికీ ప్రకృతి ఆధారమైనను, తోటి మానవుడి ప్రవర్తన ద్వార తోటి మానవులు చెడిపోవటానికి, బాగుపడటానికి ఆస్కారమున్నది. కావున సత్ప్రవర్తన గలస్నేహితులతో, సత్కుటుంబీకులతో ఉండడం ద్వార సత్ప్రవర్తన అలవడును, ఈ సత్ప్రవర్తనలోపించిననాడు యావత్ ప్రపంచమంతా అరాచకములేర్పడును. ఈ అరాచకములు చివరికి ప్రపంచ సర్వనాశనముకు దోహదపడును. కాబట్టి పిల్లలు, యువకులు, పెద్దలు అందరు శాంతి స్వరూపులై "విశ్వమానవతా ఐక్యతకు" దోహదపడగలరని నేను ఆశిస్తున్నాను. నేటి వైజ్ఞానిక యుగంలో కూడా అన్ని ప్రాంతాలలోని ప్రజలు యింకా మూఢత్వంను మరవకున్నారు. మూఢాచారములను యింకా పాటిస్తూ ఉన్నారు.

కొందరు ప్రవక్తలు భక్తి సాహిత్యంతో పాటు భ్రాంతి సాహిత్యమును జతచేసిరి. మంచి పేరుప్రతిష్టలు దెచ్చుకొన్న వారి చరిత్రలను వ్రాసేటప్పుడు కొందరు రచయితలు వారి ఊహలను కూడ జతచేసి

ప్రాస్తారు. ఆ భక్తుని తల్లిదండ్రులకు దేవుడు కలలో దర్శనమిచ్చి "నేను మీ గర్భంలో పుట్టుచున్నానని" చెప్పిన కాకమ్మకథలు ఎన్నో పుస్తకములలో గలవు. మరియు పేరు ప్రతిష్ట గల వ్యక్తులు మాకు ఆంజనేయుడు దర్శనమిచ్చెనని, ఈశ్వరుడు తుదకు ఎల్లమ్మ, మల్లమ్మ వారి వారి భ్రాంతి దేవుళ్ళ దర్శనమైనదని యిలా ఎన్నో గ్రంధములలో రచనలు మీరు యిప్పటికే వాటిని చదివియుందురు. బయట ప్రకృతి దర్శనమే కాకుండా అంతర్ ప్రకృతిలో మనోచంచల్యమైన, మనోబలహీనత వలన యిలా జరుగుచుండవచ్చునని నా అభిప్రాయం. ఏదైన వొక వస్తువును మనము గట్టిగా చూసి కండ్లు మూసుకున్నచో అదే వస్తువు మన దృష్టిలో కనిపించును. అలాంటి దృశ్యమును గాంచి యింక కొద్దిగా భ్రమజెంది నాకు కాళికాదేవి ప్రత్యక్షమై మాట్లాడినదని, నాకు అమ్మచేతితో పాయసం యిచ్చెనని, కడ్గం వొసంగినదని, ఆంజనేయుడు వీపుపైన చరచినాడని (కొట్టినాడని)చెప్పుచుండుట మనము వినియేయుందుము. వాస్తవముగా మనము గ్రహించినచో వారి మనస్సులు ఆ రూపమును తదేక చింతన చేయడం ద్వారా అలాంటి భ్రమకలిగి యుండవచ్చును. మేధావులను సహితము వీరు భ్రమపెట్టుట మనము ఎరిగియేయుందుము. ఇలాంటి కోవకు చెందిన ఫకీరులు—బాబాలు—స్వాములు విభూతిని మరియు ఏదో వస్తువులను సృష్టించి (ఏదో ఉపాయంతో ఉన్న వస్తువులను గారడిచేసి) మనకు యిచ్చుటద్వారా వారివద్ద ఏదో మహత్మ్యమున్నదని ప్రజలు తండోప తండములుగా వెళ్ళు చుండుట మనముగాంచియే యుందుము.

బంగారమైనను, ఏదైన లోహమైనను ప్రకృతి పరమైన ఏ వస్తువు పైనను ఈ సృష్టిలోని కణ సముదాయమేనని మనము భావించవలెను. అలాంటి వస్తువులు ఈ సృష్టిలోనిది గాక ఏదో ఒక సృష్టినుండి ఉత్పత్తి చేసినదనుట ఎంత వెర్రితనము. ఏదో ఉపాయముచే ఫకీర్లు, బాబాలు,

స్వాములు ఏదోవస్తువు యిచ్చుట మనము గాంచియేయుందుము. ఇలాంటి వారు మేధావులను సహితం వారి ఉపాయముచేత లోబరుచుకొని ప్రపంచములో ధనవంతులుగా, గుణవంతులుగా ప్రజల్లో ఒక విశిష్ఠమైన స్థానం ఏర్పరచుకొన్నారు. ఇలాంటి వారిని జ్ఞానులు నమ్మిమోసపోక వారియెడ బహుజాగరూకులై యుండవలెను, ఇలాంటి వారి ద్వారా కూడా ప్రజలలో కొంతవరకు ఐక్యత నశించుచున్నది. ఇలాంటి బాబాలు—ఫకీర్లు—స్వాముల వార్లను రాజకీయవేత్తలు ఆశ్రయించుట హాస్యాస్పదము. వీరి చేతిలోగూడ ప్రజలు తండోపతండాలుగా ఉన్నారని, వారి భావాలను వినుటకు వచ్చుచుందురని, సీట్లను కాంక్షించే రాజకీయవేత్తలు వోట్ల నిమిత్తము వీరిని ఆశ్రయిస్తారు. గొప్ప విజ్ఞానపరులు (లౌకిక విద్యావరులు) వీరిని ఆశ్రయించినచో ప్రమోషన్ వచ్చునని ఆశపడుదురు. ఎందుకనగా కొందరు రాజకీయవేత్తలు, మంత్రులు, అధికారులు వీరి వద్దకు వచ్చెదురని వీరి విశ్వాసం. మంచి చదువు, మంచి పదవి ఉన్న విజ్ఞానవంతులు సహితం అక్కడికి వెళ్ళడం ఎంత దురదృష్టకరము. వారిపైన వారికే నమ్మకం లేకపోవడం, నిర్మలమైన చిత్తవృత్తిని సంతరించుకొన్న మహానుభావులను జేరక, వీరిని జేరి చిత్తచాంచల్యము ఏర్పరచుకొని మూర్ఖులుగా మారుచున్నారు. ఏకాగ్రత పొందిన మహానుభావులు ప్రజలకు ఏకాగ్రత స్థితిని ప్రసాదించుచున్నారు. ఆ స్థితి ద్వారా మనోచాంచల్యము నిర్మలమై అనుభవపూర్వకముగా ప్రశాంతత పొందిన వారిని నేను ఎందరినో చూసితిని. అది ఈ లౌకిక విద్యలకు అతీతము. శాంతిని బడయుటయే మానవుని ధ్యేయం. ఇది కొంతవరకు మానవుల ఐక్యతకు తోడ్పడునని నా భావన.

కొందరు మేము గురువులమని ప్రచారము చేసికొందురు. రంగు బట్టలు ధరించి, శరీరం నిండా బూడిది పూసుకొని, బాహ్య వేషధారణలో

ప్రజలకు కొట్టొచ్చినట్లు కనబడుదురు. వారు ఆధ్యాత్మిక బోధ చెప్పుతామని ప్రజలను మభ్యపెట్టి ధన, మాన, ప్రాణములు సహితము తీసినవారు ఎందరో గలరు. వీరి చర్యలవల్ల మంచి గురువులకు కూడ బాధలు అధికములవుచుండెను. వారు మధు, మాంసభక్షణ కూడచేస్తారు. అవి చేయకూడని పనులుకదా యని ఎవరైన అడిగినచో అవియన్నియు పంచభూతములతో నిండిన ప్రకృతిలోనివి, ఈ దేహముకూడా పంచ మహాభూత నిర్మితము కాబట్టి ఆ ప్రకృతిని, ఈ ప్రకృతి గ్రహిస్తుందని ఏవో మూర్ఖపు మాటలు చెప్పుచుందురు. జీవహింస, మధువు సేవించడం, పరస్త్రీగమనం, జూదం, మృచ్ఛలించుట పనికిరావని సామాన్య మానవుడు సహితం ఆలోచిస్తాడు. అలాంటి చెడువ్యసనలోలురు గురువనడం ఎంత అవివేకం. ఇలాంటి నకిలీ గురువులను, ఫకీర్లను స్వాములను చర్చి ఫాదర్లను (కొందరు) ఆశ్రయించి మాకు మంచి జరుగుటకు ఏమైన తాయితులు ఇవ్వమన్నచో పైన తెలిపిన మూర్ఖులు ఆ అమాయకపు ప్రజలకు తాయితులు, యంత్రములను ఇంట్లో కట్టుమని, చెట్ల ముక్కలను, పొగదినుసులను యిచ్చి డబ్బును కాజేయు చుందురు. వీటిని తీసుకొనుటకు మూర్ఖపు ప్రజలు తండోప తండములుగా పోవుచుండుట మనము గమనించదగ్గ విషయం. వీరు గ్రామాలకు వెళ్ళి మంత్రకాళ్ళను చూయిస్తామని, కొందరిపేర్లు చూయించుచుంటారు. ఇలా చూయించటం ద్వారా అక్కడున్న ప్రజలు వారిని శత్రువుల్లాగ తలంచి హింసించుట శోచనీయమైన విషయం. కట్టెలు పెట్టి నిప్పుబెట్టడం, చేతులు కాళ్ళు కట్టివేసి రైలు పట్టాలపైన పరుండ బెట్టడం, తలలు నరకడం యిత్యాదులు అమానుష కార్యక్రమములు ఎన్నియో మనకు తెలియకుండ జరుగుచున్నవి. కొన్నికొన్ని హత్యలు బయటపడటం మీరు యెరింగియే యుందురు.

ఇలాంటి దురాచారములను మానవులు గ్రహించి అరికట్టవలెను. ఇటువంటి దుర్మార్గులు ఆ అమాయక ప్రజలను బాధించుటను ఆసరాగా చేసుకొని డబ్బులాగుచుండుట యిప్పటికి అక్కడక్కడ జరుగుచుండును కొందరు చదువరులు కూడ మంత్రముందని భయపడ్డవారిని నేను యెందరినో గాంచితిని. ఇంతకూ విషయం ఏమనగా ఏదైనా తంత్రముందంటే నమ్మవలెను. (తంత్రమనగా చంపటానికి గాని, ఆస్తికి హాని కలిగించుటానికిగాని, పొలములలో వాడే క్రిమిసంహారక మందులుగాని, ఆహారంలో గాని ఉపాయంతో పెట్టుట) ఈ తంత్రము ద్వారా మనిషి చనిపోతే బయట ప్రజలలో మంత్రము ద్వారా చనిపోయినాడని పట్టిపుకార్లు పుట్టిస్తారు అంతయే గాని మంత్రం ద్వార మానవుడు హింసించడం వెఱ్ఱితనము మంత్రం అనునది శరీరమును దాకునా ? లేక మనలో నున్న అంతరేంద్రియములను దాకునా? (శరీరములోనున్న అంతరేంద్రియాల బుద్ధి, చిత్తము, అహంకారము మొ॥) వాస్తవముగా భౌతిక కాయమునకు పటోలోపంవలన రోగం వచ్చును. అటుకూడ మంత్రమంటారా? మానసిక రుగ్మతవలన భ్రమచెందుచుందురు. ఆ భ్రమ చెందడము తనలోనున్న మానసిక దౌర్బల్యమే. వాస్తవంగా మనిషిని చంపే మంత్రం ఉన్నచో మనకు సైన్యం అక్కరలేదు. ఈ తుపాకులు, బాంబులు మనకు అక్కరలేకుండనే, యితర దేశీయుల సైన్యమును మన మంత్రగాళ్ళు చంపేవారు మనను చూసి యితరదేశం యొక్క సైన్యం భయపడేవారు. అలావుంటే వీరికి మన ప్రభుత్వం గుర్తించి బంగారు పతకములనొసంగును. దేశ రక్షణకు వీరిని ఉపయోగించుకునేవారు. అలాంటి మంత్రమే ఉంటే తన తోటి సోదరులను భక్షిస్తారా? వారు నిస్వార్థంగా దేశ రక్షణకు పూనుకొందురు. అలా పూనుకొన్నచో వారిని దేశ ప్రజలు మెచ్చుకొందురు ఇలాంటి మంత్రాల పేరిట తన్నుకొని పోలీస్‌స్టేషన్ వరకు వెళ్ళక

వాస్తవాలు కోకొల్లలు. ఇట్టి అవివేకం వలననే యితర దేశాలలాగ మనదేశ ప్రజలు యింకా మేల్కొనలేదని తెలియుచున్నది.

దీనివలన పల్లెటూర్లలో కొంత ఐక్యత నశించిపోవుచున్నది. కాబట్టి జ్ఞానులయిన యువకులు, యువతులు ప్రజలను మెల్కొలిపి మంత్రగాళ్ళని పేరుపడ్డవారిని మూర్ఖ ప్రజల బారినుండి రక్షించుట యెంతైనా అవసరమున్నది. ఈ మంత్రముందన్న కొన్ని ఊళ్లలో మానసిక శాస్త్రవేత్తలు పరిశోధన జరిపిరి. వారి పరిశోధనలో మంత్రముచే బాధపడుచున్నామనే వారికి మానసిక రోగము (హిస్టీరియా) ఉందని తేలింది. వారు మంత్రము లేదని చెప్పినారు. శాస్త్రజ్ఞుల మాటలు నమ్మని మూర్ఖులకు ఎంత జెప్పిన అర్థంకాదు.

మూఢ విశ్వాసాలను నమ్మటానికి మన గ్రామాలు నిదర్శనము. ఈ గ్రామ ప్రజలలో అల్లు చూపటం అనేది ఒక వింతఘోరణి. దీని క్రింద ఈవిధంబుగా నుండును. అల్లు చూసేవ్యక్తి అల్లు చూయించుకునే వారి యింటికిపోయి, ఆ యింటిలో ఒక స్థలం కేటాయించి ఆ స్థలంలో మొక్క జొన్నలైనను, జొన్నలైనను క్రిందపోయును. (ఏదైన ఒక ధాన్యమును) ఆ ధాన్యము పైన ఒక లోహపు చెంబుపెట్టి దానిపై చాటను బోర్లించి ఆ చెంబుపైన కూర్చుండును. ఆ యింటిలో అల్లు చూయించుకునే వ్యక్తి తన అనుమానం నివృత్తి చేసుకొనుటకొరకు దయ్యామో లేక దేవత యింక ఏమిటో అని వాళ్ళు అనుచుండగా, చాటపైన కూర్చున్న వ్య అటూ యిటూ ఊగును. చాటపైన కూర్చున్న వ్యక్తి రెండు చేతుల వ్రేళ క్రింద పెట్టి చాటపైన కూర్చుంటాడు. వారి అనుమానమును బట్టి చేత కదిలిస్తూ వుంటాడు. అలా తిరగడం ద్వారా ఆ చాట క్రింది చె తిరుగుచుండును. అప్పుడు వారి అనుమానం తీర్చుకొనడానికి అన్నము పసుపుతో కలిపి వంటచేసి మాంసమో, చేపలో అన్నంలో :

వారిపైనుంచి త్రిప్పి బయట నలుగురు నడిచేదారిలో పారవేస్తారు. అలా వారు దయ్యం పోయెనని భ్రాంతి నివృత్తి చేసుకొంటారు.

ఇంకొక విధమైన అల్లు. రెండు దారాలపై దీపంతను ఉండేటట్లు జేసి అటు, యిటూ దారమును అల్లు చూసే వ్యక్తి పట్టుకొని ఉండును. అల్లు చూయించుకొనే వ్యక్తులు ఆ దీపంతకు మ్రొక్కుచు తన అనుమానా లను వొకటొకటి వ్యక్త పరచుచుండును. అప్పుడు దీపంత కదులు చుండును. ఆ దీపంత గాలికైనను, వాడి బ్యాలెన్సుతో నైనను కదుల వచ్చును, లేక వాడు ఊరకనే ఊపవచ్చును. దీపము ఎప్పుడయితే కదులునో, అప్పుడు ఏ అనుమానం చెప్పకొనునో ఆ అనుమానం నివృత్తి చేసికొనుటకు ఆ దేవుళ్ళ దగ్గరకు వెళ్ళివచ్చుచుందురు. ఇలా అల్లుల పేర, ఎందరో అమాయక ప్రాణులు అనుమానంతో మ్రగ్గుట మనం కండ్లార గాంచుచున్నాము. వీరి అనుమానమును యిలాంటి ఆచారములను మూఢ విశ్వాసములను మనము పారద్రోలిననాడు మన ప్రజలందరిలో అంధ విశ్వాసము నుంచి దూరమై కొంచెమైనను ఐక్యపడుదురని నాభావన.

ఇలాంటి మూఢ నమ్మకములు ఎంతో విజ్ఞానం పెంపొందించు కొన్న అధికారులు కూడ పాటించుచుండుట ఎంత మూర్ఖత్వం. ఒక పెద్ద కర్మాగారమును నిర్మించి దానికి నిమ్మకాయలు, జీడిగింజలు, మిరపకాయ లను తీగకు కట్టి ఆ కర్మాగార గృహములకు కట్టుదురు. గుమ్మడి కాయలను ఫ్యాక్టరీ ద్వారముల ముందు కొట్టుచూ, గోడలకుకూడ కట్టుదురు. వాటివల్ల లాభాలు కలుగునని వారి మూఢనమ్మకము.

పేరు ప్రతిష్ఠల కొరకు ఫకీరులు, బాబాలు, స్వాములు, అమ్మలు యితర దేశములను దర్శించడం ద్వారా, అక్కడివారు యిటునుండి వెళ్ళిన వారిని ప్రేమించుట సహజము. ఇక్కడికి వచ్చిన పిదప ఏదో ఘనకార్యము చేసినటుల ప్రజలు వారిని సందర్శించుట, అక్కడి వింతలు విశేషాలను

అడిగి తెలుసుకోవడం వీరికి ఒక ఆనందము. వీరి బలహీనతను ఆసరాగా చేసుకొని వారిని మోసపుచ్చటము జరుగుతుంది. ఇతర దేశములకు వెళ్ళి వచ్చిన వారు జ్ఞానమును సంపాదించారని మహాజ్ఞానులని అనుకోవడము పొరపాటు. ఇతర దేశములలో అజ్ఞానులు లేరని, అంతా జ్ఞానవంతులేనని అనుకోవడం పొరపాటు. అక్కడకూడ ఎన్నో మూఢ విశ్వాసాలు గలవు. ప్రాశ్చాత్య దేశాలవారు 13 సంఖ్య అంటె భయపడుదురు. కొందరు ఉప్పును మూడు రాత్రులు కాల్చినచో తన కోరిక నెరవేరునని మూఢనమ్మకం గలవారు కూడ గలరు. అరేబియా వారు అనగా ఇస్లాం మతం వారు 786 అంటె ఎంతో యిష్టపడతారు. నిన్నమొన్నటి వరకు 3 సంఖ్య అంటే మన దేశంలో ఎక్కువ యిష్టపడేవారు. ఇప్పుడు కూడ యిష్టపడుచున్నారు. అన్ని దేశాలలో దేవుడని రాయిచుట్టు తిరుగుచుంటారు. మన దేశంలో గుళ్ళో ఉన్న రాయిని దేవుడని నమ్ముతారు. క్రైస్తవులు ఏసు విగ్రహానికి మొక్కుతారు. ఇస్లామీయులు మక్కాలో ఒక పెద్ద రాయిని ముద్దు పెట్టుకొని వచ్చుదురు. రెండు కొండల నడుమ అటుయిటూ ఉరుకుదురు. అది అంధవిశ్వాసంకాక యింకేమి. యిలా ఎన్నో మూఢ నమ్మకాలు గలవు, మచ్చుకొకటి యిక్కడ వ్రాయడమైనది.

మన దేశంలో పిల్లికనపడగా ప్రయాణం ఆపుకొందురు. పిల్లి ఎదురుగా వచ్చిన దుశ్శకునమని తలుస్తారు. అలాగే కొన్ని దేశాలలో పిల్లి కనిపిస్తే శుభ శకునముగా భావిస్తారు. ఈ మూఢ నమ్మకాలు అన్నీ అప్పటి పూర్వీకపు మనుష్యుల బలహీనతనే కావచ్చును. వారే బలహీనులు కాకుండా ఇంకను బలహీనపరచు యిలాంటి మూఢనమ్మకాలను మనము ఏరివేయవలెను.

కొన్ని చెట్లు ఒకచోట చేర్చి వాటిచుట్టు ప్రదక్షిణ చేయడము ద్వార తన కోరికలు నెరవేరునని కొందరి యభిప్రాయము. ఇంకొందరు తన

ఘనమైన లోహముతో కాల్చి ముద్రలు వేసుకొందురు. వీటి వలన మోక్షము లభించునని వీరి నమ్మకము. వాస్తవముగా తనలోని చెడు గుణములను విసర్జించవలెనని మీరు ఎరుగక ఇలాంటి మూఢనమ్మకాలతో కాలము వెళ్లబుచ్చు చుందురు.

పూర్వకాలమందు యజ్ఞయాగాదుల పేరిట జంతుబలులు జరుగు చుండేవివి. ఇంచుమించు అన్ని దేశములలో క్షుద్రదవుపాసనల ద్వార నరబలులు జరుగుచుండేవివి. ఇవి మహానేరములని, అప్పటి సంఘ సంస్కర్తల ద్వార కొంతవరకు నిరోధింపబడినవి. ఇప్పటి నాగరీక లోకములో కూడ యేదో విధముగా జంతుబలులు చేయుట, ఒకరిపై నొకరు ద్వేషము పెంచుకొని మానవులు మానవులనే పొడచుకొనుట విచారకరము. ఇదికూడ నరహత్యనే కావున మానవులు గ్రహించి ఈ మూఢగుణమును విడిచేదెన్నడో !

యజ్ఞములో యిప్పటికి ప్రాణాయస్వాహా, అపాణాయస్వాహా యని పంచ ప్రాణముల పేర్లను ఉచ్చరించుట గలదు. వారి కార్యక్రమములు ముగిసిన పిదప బలిరూపముగా ఒక నారికేళమును అందులో వేయుదురు. దీని వలన వాతావరణములో పరిశుభ్రత ఏర్పడునని వక్కాణింతురు. కొంతవరకు వాస్తవమైనను జ్ఞానులు ఇంకాయోచించవలసియున్నది. అది నా ఉద్దేశములో అంతర్ముఖముగా ధ్యానము కొరకు ప్రాణవశమొనర్చుకొనుటే ధైర్యశాలి లక్షణము. ఈ ప్రాణవశము వల్లనే మహాయోగులైరని ఈ అభ్యాసము ద్వార మనో చంచలత్వము తగ్గి ధీమంతులు యెన్నియో కార్యక్రమములు జేసిరి. కావున యేకాగ్రతకు (ధ్యానమునకు) పాణవశమే ముఖ్యమని యెరుంగవలయును.

ఏ దేశములోనైన సత్యాసత్యం గ్రహించిన జ్ఞానులు లేకపోలేరు. కాని ప్రజలు వీరి మాటలను లెక్కచేయరు అజ్ఞానమనునది యించుమించు

అందరిలోను ఆవరించు కొన్నదని తెలియవలెను, దానిని కొంచెం ఎరిగి ప్రకృతి పరిశోధన ద్వార మనము జీవించు కాలానుకూల ధర్మంగా మన యొక్క జ్ఞానమును పెంపొందించుకొనవలెను.

తాత్వికులు యించుమించు బ్రహ్మచర్యమును పాటించిరని చరిత్రల ద్వార మనకు విషదించబడు చున్నది. బ్రహ్మచర్యము అనగా భార్య ఉండకపోవడం యని కొందరి యభిప్రాయము. ఇంక రెండవ శాఖకు చెందినటువంటి వారు బ్రహ్మము యందు చరించడమే బ్రహ్మ చర్యమని బోధింతురు. ఇంకొక తరగతి ఆలోచనవారు పరిణయము సత్సంతానోత్పత్తి కొరకు మాత్రమే ఆడవలెనని, అతి విషయలోలత్వము మంచిది కాదని బోధింతురు. ఆది కాలమందు ఈ బ్రహ్మచర్యమనె జిజ్ఞాస యించుమించు లేదనియే తెలుపవలెను. మనుష్యుని ఆలోచన పెరిగిన కొలది ఈ శరీరఘట్టము వల్ల ఈ దుఃఖ ఘట్టము మొదలైనదని, దీనిని పూర్తిగా నివారించు కొనవలెనని ప్రయత్నశీలులు వారి ఉపాయము ద్వార సుఖ, దుఃఖములను అతిక్రమించిరి. ఇలా అతిక్రమించిన మహాత్ములు ఈ ప్రపంచ సుఖమును తుచ్ఛమని నిర్ధారణ చేసుకొనిరి. ఈ శరీరము జనని గర్భమునుంచి వార్ధక్యము వరకు మార్పులు చెందుచూ వచ్చిన యితర శరీరములను గాంచి తనతనువు కూడ నడువలేని స్థితికి దిగజారిపోవునని మల మూత్రం వాసన గొట్టు శరీరమని వారిలో వారు నిర్ధారణ చేసుకొని ఈ రక్తము, మాంసము, అస్థిపంజరముల బొమ్మల కలయిక విచిత్రమైనదని, ఈ మోహమున పడగూడదని గ్రహించుకొని తన శరీరముపైన ఎలాంటి మక్కువ గలదో ఇతర ప్రాణులకు గూడ అలాంటి మమకారములు గలవని గ్రహించి, ఇతర జీవులను హింసించక దయార్ధ హృదయులై సత్సంప్రదాయము సేవజేయ వలెనని పరిణయంబాడుట మానుకొనిరి. కొందరు పరిణయంబాడి కూడ విషయ

సుఖమును కాంక్షించని ప్రజలలో కేవలము భార్యాభర్తల లాగ కనిపిస్తూ యితరుల దుఃఖ నివారణోపాయమును బోధిస్తూ ఉంటారు. కొందరు గృహస్థాశ్రమమును స్వీకరించి, ఒక కాలపరిమితి ననుసరించి బిడ్డలను కంటూ ఉంటారు, దీనినే గృహస్థ బ్రహ్మచర్యమని పూర్వీకులు నుడివినారు. కొందరు విషయ విరక్తులై ప్రపంచ సుఖముల యెడ విరక్తి జనించి, ధ్యానముద్రలో కొన్నినాళ్ళుండి యితరులకు సేవజేయ బూనుదురు. వీరిని విధుర బ్రహ్మచర్యులందురు. శరీరము ఉత్పత్తి అయిన నుండి లయమొందువరకు విషయ విరక్తులై యుండి యితరులకు సేవజేయుచు వారి కాలమును గడుపు వారిని నైష్ఠిక బ్రహ్మచారులు అని యందురు. ఇవి అన్నిటికి మూలం దుఃఖమును నివారించుకొనే సిద్ధాంతము. మరి సుఖ దుఃఖము అనుభవించితే యేమవుననని కొందరికి ఊహకూడ రావచ్చును. వాస్తవముగా ప్రపంచములో సుఖమున్నదా ? అని ప్రశ్న వేసుకొన్నచో మనస్సు నిశ్చలమైనటువంటిస్థితిలో నున్నప్పుడే ప్రమసరించుచున్నది. చలనము యున్నంత మట్టుకు సుఖ, దుఃఖములు తన శరీరమును అంటుకునే ఉండును. కావున తన మనస్సును నిశ్చలస్థితిలో ఉంచుకొని, ప్రపంచములో తిరుగాడు వ్యక్తియే గొప్పవాడు. శరీరము యింద్రియముల చలనము వీనితోనె చిత్తస్పందన ఏర్పడును. ఈ చిత్తస్పందనకు ప్రకృతి దోహద కారి యగును. ఈ మూలంబెరిగిన మహానుభావులు ప్రకృతికి అతీతమయిరి.

మనిషి యెన్ని సంవత్సరములు జీవించినాడని కాదు. తను చేసిన మంచి యెన్ని సంవత్సరములు జీవిస్తుందన్నదే ముఖ్యం. నిష్కపటంగా, నిర్మలంగా ఉండి కీర్తిని కాంక్షించని వారికే ఈ సహజమగు మహోన్నత స్థితి లభించును గాని వ్యర్థులకు సిద్ధించదు.

గృహస్థులకు గృహమును విడనాడె బోధనలను చేయకుము. నీలోచెడు సంకల్పములను, యుద్వేగములను పూర్తిగా విడువుము, నశింపజేసుకొనుము. సానుభూతి, వాత్సల్యముతో యితరులను ప్రేమించుము. గృహమును శుభ్రంగా ఉంచుకొనుము. శుభ్రతకు విలువను [illegible]యుము. నీకు బాధ గలిగినదని ఇతరులను బాధింప ప్రయత్నింపకుము. నీ యిష్టా యిష్టములు మంచో చెడో విచారించి ఏదైన చెడు తలంపులు నీహృదయమందు చోటు జేసుకొన్నచో పశ్చాత్తాపము నొంది మళ్లీ యది జేయకుండ నుండుము. వ్యర్థములైన, నిష్ప్రయోజకరములైన యాలోచనలను విడువుము. అపారమైన కరుణ నీ హృదయమందు ప్రతిష్ఠించుకొని క్రోధ, ద్వేషావేశములకు నీ హృదయమందు చోటివ్వకుము. అనంతమైన సద్భావనతో దుష్టులను సహితము చేరదీయుము. అలా చేరదీసి వారికి కొకరు సహాయపడునటుల చేయుము [illegible] స్తుతించుకొనుట, పరనిందా, గర్వ[illegible] దోషములను విచారించి వాటిని, అ[illegible] జూసుకొనుము.

పైపై ఆడంబరములను పాటించి అంతర్[illegible] [illegible] లేక ధర్మభ్రష్టుడవు గాకుము.

తల్లిదండ్రులను గురువులను గౌరవించుము. ఇతరులను దూషించకుము, వారిపై అపనిందను మోపుట, ఇతరుల సొత్తును అపేక్షించుట మానుకొనుము. నిష్పక్షపాత బుద్ధిని అలవరచుకొనుము. సత్యమని తెలిసినను చెప్పుటకు భయపడెదవేల ? సత్యము కటువుగానున్నను యది సత్యము గాక మానదు కదా. ఒక్కొక్కప్పుడు సత్యమును నీవు అవగాహన చేసుకొనలేక పోయినను యది సత్యముగాక మానదు. అసత్యమును [illegible] ఆపలేరు. అది సత్యమైయుండో యది సత్యముగా తెలియును. [illegible]

వలన వాస్తవమైన మార్గమును విడచి తప్పుత్రోవ పట్టుచున్నావేమో జాగ్రత్తపడుము. అన్వేషించువాడు ఓర్పుతో పట్టుదల వహించినచో సత్యమును గ్రహింపక మానడు. బలహీనులను బలవంతులు అణచివేయుట అప్పటినుంచి ఇప్పటివరకు సాగుచున్నది. వారికి దయాహృదయముతో చేయూతనివ్వుడు. బాహ్య భౌతిక ప్రపంచమును గుర్తెరిగే శక్తి యంతయు నీలోనుండె వెలువడుచున్నదని గ్రహించుము.

సుఖము, దుఃఖము నీలోనే నెలకొని యున్నది. ఇవి తెలుసుకొని తన్నుతాను గ్రహించిననాడు యావత్ ప్రపంచమును వశపరచుకొనిన వాడగును. ఇదే నిజమైన స్వాతంత్రము. యింద్రియములు ఆయా విషయములందు పోవుట ద్వార భ్రమకులోనై పరతంత్రులగుచున్నారు. కాన బాహ్యప్రపంచ భౌతిక వస్తువులపై గాక చిత్తమును పవిత్రభావనతో ఉంచుకొన్ననాడు సుఖము యననేమో తెలియగలరు. ప్రతి ప్రవృత్తి తన చిత్త స్పందననుసరించియే జరుగును. కావున భ్రమకు లోబడక సత్యాసత్యములనెరుంగుము. వైరాగ్యమనగా అన్నింటిని విడవడముగాదు. అందరి యెడ అన్ని వస్తువుల మీద పవిత్రభావనతో ఉండడమే వైరాగ్య మనబడును.

నీ కిష్టమైన వస్తువు చిక్కలేదనే బాధవలన నిరాశతో ఇతరులను బాధించకుము. ఓ సోదర సోదరీమణులార సౌందర్యమనునది ప్రకృతి సొమ్ము, బాహ్యముగా ఆకర్షితులను జేసి మనుష్యులను మోహావేశములకు గురిజేయును. కావున జాగ్రత్తపడుము. తగాదాలకు దారితీయు వాదోపవాదములను విసర్జించుము. రాగాది దోషములను విడనాడే ప్రయత్నములో ఉత్సాహమును జూపించుము.

ఇతరుల తప్పులనెంచుట కంటె తన తప్పులెంచుకొనుట ఉత్తమము. స్వార్థపూరితమైన ద్వేషము, అసూయ స్వహితులను విడదీయును వీటి వలననే వొకరినొకరు మోసగించుకొని చెడిపోవుచున్నారు

తృష్ణను జయించిన తత్వవేత్తలే మనకు మార్గదర్శకులు. వారి పలుకులను పాటించి మీకుమీరె స్వప్రయత్నము చేయవలెను.

భోజనము మితముగా భుజింపుము. కాని ఒకే పళ్లెములో, ఒకే కాలమందు అందరు తినడం మంచిదికాదు. ఎందుకనగా అంటువ్యాధులు సోకి అనారోగ్యమునకు గురిచేయును. ఆరోగ్యము మరియు సంతుష్టియే మహాసంపదని భావింపుము.

ప్రకృతి సౌదర్యనిధిని తానే (మానవుడు) అనుభవించాలని తహ తహలాడుచుంటాడు. కాని అందులో పరమాణువంత కూడ గ్రోలలేక పోతాడు. అనుభవించవలెనని ఎన్నో సమకూర్చుకొంటాడు. తుదకు అనుభవించకనే వెడలిపోతాడు. మనుష్యునియొక్క వైఖర్యము యిలాంటిది. ఈ ప్రకృతి సౌందర్యనిధిని యితరులు కూడ అనుభవించవలెనని ప్రయత్నశీలులు ఒక విధమైన ఆనందమనే అనుభూతిని పొందగలరు.

జ్ఞానముచే పరిశోధన ద్వార కోరికలు అధిగమించి పోలేకుండగానే కామ క్రోధాది అరిశడ్ వర్గములను జయించినాడు ఈ కల్పించే జగత్తే యంతయు లేనిదిగామైపోవును. చూపరులకు అలాంటి వారు కర్మ చేసినట్లుగా కనిపించినను వారి మనస్సు ఒకే ధ్యేయముపై నిలుచుటద్వారా కర్మాతీతులే. ఆ సాధకులను అర్థము చేసికొనడము మహాజ్ఞానులకు సహితము కష్టతరము. అలాంటి మాటలను ప్రయోగించి అజ్ఞానాంధకారములో మున్నవారు కూడ యింక పూర్ణజ్ఞానములో మునిగిపోవు సాధకులైన మహానుభావులనుతెలియుదురు.

కొందరు శరీరములో ప్రాణము పోయిన పిదప ఆత్మయనే వస్తువు యింకొక శరీరంలో జొరబడునని, కొందరు ఆత్మలు అనునవి అసలు లేవని యిది వెట్టి బ్రాంతులుయని వాదించుచుందురు. ఇంకొందరు శరీరం విడచిన తర్వాత ఆత్మ పరలోకమందు స్వర్గము, నరకము చేరునని, స్వర్గంలో ప్రభువుతో సుఖంగా ఉందురని, నరకములో యమ కింకరులతో బాధపడుదురని వారి అభిప్రాయము. ఇలాంటి వెట్టి మొట్టి భావాలతో వీళ్లలోవీరికి సఖ్యత కలగక పోట్లాడుకొనుట మనము చూసియేయుందుము. ఒకింత మనముకూడ ఆలోచిద్దాము. మానవుడు సృష్టి ఆదినుంచి ఎన్నియో పరిశోధనలు గావించినాడు. ఇలాంటివి కూడ పరిశోధించినాడు. ఇప్పటివరకు కూడ దీన్ని గూర్చి పరిశోదిస్తూ ఉన్నాడు. అయితే పరిశోధనలో వారివారి భావాలకు ఎలాతోస్తే అలా పూర్వము నుడివినారు, ఇప్పుడు నుడువుచున్నారు. మన తల్లిదండ్రుల కలయిక వలన శుక్లశోణితముల (క్రోమోజోముల) ద్వారా బీజోత్పత్తయి ఈ దేహము ఉత్పత్తి అవుచున్నది. అనగా మన శరీరమునకు అందులో శక్తికి, ఆ శరీరమును ఆడించే శక్తికి స్త్రీపురుషుల కలయికనే ప్రధాన మైనటువంటిది. అంతకుముందు ఈ బీజములో చలనముండియే తీర వలయును. లేక ఆ క్రియయే మూలపదార్థములో చలనము ఏర్పడి ఉండ వచ్చును. ఆ చలనంద్వారానే మార్పుచెంది మానవ శరీరం ఎదిగి ఉండ వచ్చునని నా యూహ. ఈ ప్రకృతి, ఈ చలించు శక్తి రెంటికి మూల మైనది ఎవరికీ గోచరించదు. అది అగోచరము. పరిశోదించని నాస్తికులు దేవుడులేడుయని పరిశోదించని ఆస్తికులు దేవుడు గలడని యను వెర్రి వాదులాటను (చిత్తభ్రాంతిని) చూచుచుందుము. వీరు మాది సత్యమంటే మాది సత్యమని పోట్లాడుకొనుట చూసిన జ్ఞాని ఈ ఇరుపురి తెగల వారు మూర్ఖులని గ్రహించగలడు. వాస్తవంగా చెప్పరానిది కాబట్టి మౌన ముండుటే మంచిది. కాని యోగులు మనస్సును సమాధిచేసి నిమగ్నమౌదురు.

మానవుని శరీరంలో చలనం ఉన్నంత మట్టుకు భావాలు ఉండుట సహజము. ఒకరి భావములు ఇంకొకరి భావాలు ఒకేవిధంగా ఉండవు. ఇలా భావాలు వేరైన కారణాన మనుష్యులలో ఐక్యత చెడిపోవుచున్నది. అందరి భావాలు ఒకే ధ్యేయంపై ఉండటం దుర్లభము (ఇష్టాయిష్టాలు వేరైన కారణాన) శరీరం విడిచిన తర్వాతనైనను లేక జీవించి ఉండగా నివృత్తి సాధించిన మానవులలోనైనను ఏకత్వం గోచరించును. (జాగ్రితావస్థలో) తెలివిలో ఉన్నప్పుడు భావాలు ఒకటిగ కలువడం చాలా కష్టము. అందుకే "లోకోభిన్నరుచిః" అన్నారు. గాఢనిద్రలో అందరు విశ్రాంతిని తీసుకొంటారు. మళ్లి మేల్కొనగానే వారి భావాలు కలువవు. కావున జాగ్రిత్తావస్థలో జాగ్రత్తచే ఉపాయముచే నివృత్తి మార్గమును తనకైవశము చేసుకొనుటే ముఖ్యమని కొందరు పూర్వము ప్రయత్నించారు. కొందరు అన్నింటిని విడవడము అవసరము లేదు మనస్సును పవిత్రముగా వుంచుకొని నిత్యకర్మ నిష్టచేయుటే మంచిదని నుడివినారు. వాస్తవముగా నివృత్తి మార్గము కొరకై సాధన చేసిన ధీమంతులు అపుడు లోకాతీతానందము నొందుతారు. తర్వాత యెరుకలోచేరిన తర్వాత మంచి ఆలోచనకొరకు ప్రయత్నిస్తారు అలానడుస్తారు. ఇంకొక కోవకు చెందినవారు లోకాతీతానందంనొంది అపుడు పొందిన యెరుకకలుగు వేళ మనస్సును పవిత్రభావాలతో ఉంచుకొనక లోకములో పలు యిక్కట్టులకు గురియవుట తెలిసినదే.

ఎన్నియేమైన శరీరము ఉన్నప్పుడు కర్మ తప్పదు. ప్రపంచ బంధములను విడుచుట కష్టం. ఎందుకనగా శరీరమున్నప్పుడు అందరు అవసరమే, అన్నీ అవసరమే. కాని అందరియందు పవిత్రభావము, అన్ని వస్తువులయెడ పవిత్ర భావము కలిగియుండుటే శ్రేయస్కరము.

" లోన వున్న చలించే అభ్యంతర వస్తువు ఒక దానిపై పరిశోధకుడు దృష్టి కేంద్రీకరించినపుడు బాహ్య దృష్టి నశించుచున్నదని వారి అనుభవం వలన మీరు గ్రహింపగలరు. దాని వలన కలవస్తువు ఒక్కటేయని తెలుచున్నది. అందుకే వేదాంత (జ్ఞానాజ్ఞానాంత) సిద్ధాంత సారమున ఆత్మసర్వవ్యాప్తం. శరీరం గూర్చిన భావన అదృశ్యం కానిది ఎవ్వడును ఈ వేదాంత సారమును గహింపజాలడు."





విశ్వమానవత సమాజ స్థాపకులైన
శ్రీ అవధూత నిర్మలానంద స్వాములవారి రచనలు.

1. సోఽహం
2. సున్న
3. శ్రీ సోహామృతసారము
4. శ్రీ అవధూత నిర్మలానంద స్వామి శతకము
5. హృదయఘోష (తెలుగు, హింది, ఇంగ్లీష్)
6. గురుదర్శనమ్ (సంస్కృత శ్లోకములు)
7. సోఽహం (హింది)
8. ది జీరో (ఇంగ్లీష్)
9. శ్రీ నిర్మలానంద మహర్షిస్తోత్రం (సంస్కృతశ్లోకములు)

త్వరలో అచ్చువేయు గ్రంథములు

అమరవాణిగేయములు

సోఽహామృతసార్ (హిందిగేయములు)

నోట్:—ప్రతి సంవత్సరము మాఘ పౌర్ణమకు వొక రోజు శ్రీ స్వామీజీ, మాతృమూర్తి గారల తత్వోపన్యాసములు నిజాం పర్కిరోడ్ సీతారామకాలోనిలో జరుగును. కావున భక్తులు రాగలరు.

ఇట్లు
విశ్వమానవత సమాజం